# విద్యావిలాసము

గ్రంథకర్త

శ్రీమాన్

గుదిమెళ్ల రామానుజాచార్యులు

ముక్తిపల్లి అగ్రహారము

కృతిపతి

శ్రీయుతులు

చిట్టావెగ్గడ సీతారామాంజనేయులు

గుడివాడ

1942

కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాల,

మచిలీపట్టణము.

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు కవిగారు

ఆంధ్రజాతీయకళాశాల, బందరు.

తేటల్దేరి తటిద్వయమ్మెమ్మరయుం
మృద్వీకప్రవాహమ్ము, ము
ప్పేటల్ గుప్పిన తారహారము,
గులాబీతోట, పూదేనె క్రి
యూటల్, ఘోటకవల్గనమ్ములను
నీ యుద్వేలకావ్యోక్తికిన్
సాటిన్ జెప్పద నో హాయానన
దయాసంపూర్ణ! రామానుజా!

# పండితాభిప్రాయములు

శ్రీ పింగళి లక్ష్మీకాంతం కవిగారు, ఎం. ఏ.,
ఆంధ్రయూనివర్సిటీ లెక్చెరర్, విశాఖపట్టణము.

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారనెడి యీ విద్వత్కవి, నామిత్రుడు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావునకు పూర్వపరిచితుడు: మఱి నాశిష్యుడు చిరంజీవి కాకాని నరసింహారావునకు పరమ మిత్రుడు. వీరిర్వురిద్వారా, వీరికి నాతో పరిచయము కల్గినది. ఆ పరిచయము వ్యావహారికముగాని, వృథాప్రాసంగికముగాని కాక, కవితాగోష్ఠిరూప మున నగుటచే, అతి సరసముగా నుండెను.

తొలి సమావేశముననే ఈ కవీశ్వరుడు తాను రచించిన "మురళీ ధరవిలాసము" "విద్యావిలాసము" అనెడి గ్రంథములను, సాంత ముగా చదివి వినిపింపగా, సావకాశముగా, తదేకచిత్తముతో విని యానందించితిని.

వీరి కవిత్వము, ప్రాయికముగా, బహు సమాసభూయిష్ఠము. ఆ సమాసములు అప్రతర్కితముగా నోట వెడలుచుండ కవి, అవశుడై రాగాలాపముచేయు గాయకునివలె పాడకట్టుచుండును. ఎంత సమా సమయమైనను, శైలి సుప్రసన్నమై స్వచ్ఛదర్పణము బింబమునువలె, అర్థమును ప్రస్ఫుటము చేయుచుండును. ఇది కేవల పురాకృత పుణ్యమనక తప్పదు.

మరియు, ఈయనకు కథాకల్పనయెడ కుతూహలము మెండు; నేను విన్న రెండు కావ్యముల యితివృత్తములు, స్వకపోలకల్పితములే; ఈ కల్పనలు ఉద్దిష్టార్థనిర్వాహకములుగా నుండుటచే సార్థకములయ్యెననియే నే ననుకొంటిని.

లేఁబ్రాయమ్ముగల యీ కవి భావికాలమున ఇంతకంటెను ఉత్తమ రచనలుచేసి చిరకీర్తిని ఆర్జించుకొనునని నేను గట్టిగా విశ్వసించుచున్నాను.

---

# కృష్ణా పత్రిక

ఈ విద్యావిలాసము శ్రీఆచార్యులవారి స్వకపోలకల్పితమైన చక్కని కావ్యము. కవితయో!— నాకధునీప్రవాహము. కవిగారిని కవిత వరించినదిగాని, కవితను వారు వరింపలేదు. పిన్నతనమందు వీరి కింతధార, ఇంత ప్రతిభ లభించుట పూర్వపుణ్యము. ఆచార్యులవారన్న సరస్వతీ స్వరూపులనిపింతురు. విద్యావిలాసము వాణిచేతి బంగారువీణగా వెలయగలదు. ఈకావ్యము నిజముగా కవిగారి ముంజేతి చిరు గంటైనది.

## శ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఏ.

### మహారాజా కాలేజి పండితులు, బెజవాడ.

మన దేశములో ప్రబంధ రచనము ఏనాటికి నంతరించదు. క్రొత్త కెరటాలు వచ్చుచునే యుండును. ప్రాతవాహిని దానిదారి నది ప్రవహించుచునే యుండును. వసుచరిత్రకు పిల్లలు కలవు. ఈ 'విద్యావిలాసము' పిల్లకళాపూర్ణోదయము. ఇంగ్లీషు వాసనలేని బుద్ధి స్వకీయాంధ్రపూర్వసారస్వతమునుండి మరల మరల తానెట్లు త్రవ్వుకొనునో యథార్థమైన జాతీయతాస్వరూప మెట్లుండునో యీ కావ్యమునందు గోచరించును.

కవియొక్క ధారాశుద్ధి గాంగనిర్ఝరసదృశము. మధురమైన మనోహరమైన కుంటువడక రచన శిలాస్ఖలనములేని సూటియైన ప్రవాహము తరుముకొని పోయినట్లు సాగుచున్నది.

ఈ కవి వేదాంతాభిమాని. కప్యాసమివ పుండరీకమన్న వాక్యాది చర్చాదులీ కావ్యమునందు సువిస్పష్టములు. అద్వైత విశిష్టాద్వైతము లందు నిష్పాక్షికుడు. చక్కని ఉపజ్ఞ, తదుచితవ్యుత్పత్తి కలిగి సర్వము ప్రశస్యముగా నున్నది.

మరి ఈ కృతిభర్త నాకు సగోత్రుడు. అది మరి నాకు ప్రియము.

ఈ మధుర కల్పనాకవికి శ్రీమన్నారాయణుడు దీర్ఘాయురారోగ్యములు ఇతోఽధిక సత్కావ్యనిర్మాణచాతుర్యము ప్రసాదించుగాత మని కోరుచున్నాను.

## బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు, బందరు.

### —: విద్యావిలాసరచయిత కాశీఃపత్రిము :—

కవి రామానుజ నీ 'విలాసములు' శృంగారోక్తి గంగాసరి
న్నవ లీలాశుకతాస్ఫురద్రుచిరవిన్యాసంబులన్యాసమ
స్తవనీయోత్తమనవ్యకల్పితకథాసారార్థ 'పూర్ణోదయ'
ప్రవణోదంచితధీప్రయాసములు విద్వన్మోదదాభ్యాసముల్.

ధీమతి 'భామతి'న మదికిఁదెచ్చు 'విలాస' కథావిధానవిం
పౌమతిశతత్వమత్త్వమరయుందగి వాక్కలనంబునందున
న్వైమతవాదవైఖరుల నందఱకున్ హితమారఁబల్కనౌ
సీమహినిట్టి సత్కృతులె వెచ్చ హాయానను దోమనీమెయిన్.

## బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు శతావధాని–గుడివాడ

మ॥ హితమై, సంతతసౌఖ్యదంబయి మహాహేమవాభాధాకమై
శ్రుతికిన్, సంస్కృతికిన్ వినోదమయి ప్రస్తోత్రస్ఫురద్రూపమై
ప్రతివిద్యానుమతస్వతంత్రకవిరాడ్రామానుజాచార్యక
ల్పితమై శేముషికశారదాంక మలరున్ విద్యావిలాసంబహో!

మ॥ సకలానందపదార్థభావగరిమన్ శక్తిన్ నిగారించి. సా
త్త్వికబోధామృతసత్స్వభావమహిమన్ దృప్తిన్ బ్రసన్నించి. ప్రౌ
ఢకళానంతచిరత్నరత్నరుచికిన్ డాలున్ బిసాళించి, దై
వికమై జ్ఞానికతత్వసిద్ధి వెలయున్ విద్యావిలాసంబహో!

మ॥ విధికిన్ వాణికి వాడభావము సమావిర్భావమౌ పెట్టులే
విధి భర్తన్ సతి భార్యనున్ బతియు, వేర్వేరన్ జయింబందుఁబె
న్నిధి నిన్ వీడునె [illegible] కమందుఁ దగునే నీతిన్ విలోకించినన్
విధిమౌ, విద్యయె భామణంబునిలుపున్ విద్యావిలాసంబహో!



శ్రీ హయగ్రీవాయనమః

శ్లో॥ అఖిలభువనరక్షాదక్షవీక్షానివేశః
వినతవివిధభూతవ్రాతవిశ్రాంతిదేశః
ప్రణయమధురరాధారాసలీలాకృతాశః
జయతు, శుభనిదేశః కృష్ణనామా పరేశః॥

శ్లో॥ జయతు జగతి, విద్వచ్ఛంకర ప్రౌఢరామా
సుజమతవిషయాసః, దివ్యవాణీనివాసః,
మధురరసవికాసః, పంచమోల్లాసరాసః
సుదృగసుగుణహాసః, కోఽపి "విద్యావిలాసః" (శ్లేషః)

ఉ॥ శ్రీమధురప్రసూనతులసీదళగుంభితకంఠదామ! ప
ద్మామహిళాస్వరూపవసుధాతనయాహృదయాబ్జధామ! వీ
ణామునిగీయమానకరుణారసభూమ! నమత్సుదామ! సం
గ్రామసురారిభీమ! మునిరాజవిభావితనామ! రాజసు
త్రామ! జనాభిరామ! మధురస్మితవిస్ఫురదోష్ఠసీమ! సు
శ్రీమదుదారసౌహృదవశీకృతపావనకామ! సద్గుణా
రామ! విభాకరాన్వయశరత్తిథిసోమ! యశోవిశేషసు

స్థేమ! సురాసురవ్రకరశీర్షతటీవిలసత్కిరీటమా
లామహనీయరత్నవిచలత్కమనీయఘృణీప్రసారసం
క్రామితపాదుకాయుగళకమ్రపదాంబుజపీఠికామణీ
గ్రామ! జగత్త్రయీనుతివికాసితధైర్యరమాలలామ! ని
స్సీమదయాస్వభావవివశీకృతసత్సుగృహీతనామ! సు
శ్యామశిరీషపుష్పమృదుచారుశరీరవిలాసమోహిత
శ్యామ! సుబాహుముఖ్యరిపుసంహృతికల్పితగాధినందన
క్షేమ! పవిత్రపాదసరసీరుహపాంసువిశోధ్యమాన దు
ష్కామమునీంద్రభామ! శివకార్ముకభంజనదక్షదోర్బలో
ద్దామ! స్వబాహువీర్యజితతాదృశభార్గవరామ! జానకీ
ప్రేమమయస్వభావశిశిరీకృతధామ! సమస్తభోగని
ష్కామ! వనాధివాసవిధిగౌరవపూరితకేకయాత్మజా
కామ! సితాగ్రబాణతతిఖండితదూషణముఖ్యరాక్షస
స్తోమ! ప్రియావియోగభవశోకదవానలదహ్యమానహృ
త్సీమ! ఖగేంద్రబోధితసతీహరరావణనామ! పాంపవీ
చీమృదువాతధూతసరసీరుహకాననగంధవర్ధితో
త్కామ! కపీంద్రవాలిహతిదక్షితబాణవిరామ! కుంభక
ర్ణామరవైరిశీర్షకలనాప్రకటీకృతశౌర్యసామ! ర
క్షోమణిరావణాసురనిషూదనతోషితసర్వదేవతా
రామ! నివృత్తకామ! రఘురామ! సుధామ! నమోనమోస్తు తే.

ఉ॥ శ్రీమదుపాసనావిధివిశేషవశీకృతపావనాక్షర
స్థేముఁడు మహామహానసుఁ డశేషకలామయుఁ డర్థిలోకచిం
తామణిరూపకోమలసుధారసపేయకృపాకటాక్షవీ
క్షామహనీయసౌహృదవశంవదుగానను జేయుకుందునే ?

క॥ యామున తీర్థవిగాహియు
భామాసహితుండు విబుధవైరిప్రహతి
స్థేముఁడు, నరకారియునగు
రామానుజదేశికుండు రాజిలుఁగాతన్ (ద్వర్థి)

ఉ॥ చారుసరస్వతీచరణసారసయుగ్మసువర్ణనూపురో
దారఝుళంఝుళస్వనవిధానరణన్మృదుసంస్కృతాంధ్రవా
చారచనావిశేషవిలసత్కవితామకరందవాహినీ
పారగులా పురాద్యతనపండితసత్కవులన్ దలంచెదన్.

ఉ॥ శ్రీగుడిమెళ్ళవంశసరసీజవనీనవభాస్కరుండు ది
వ్యాగమసంప్రదాయవిషయప్రతిపాదనలబ్ధసద్యశ
శ్శ్రీగరిమాస్పదుండు నయశీలుఁడు వేంకటరంగనామవి
ద్యాగురుశేఖరుండు స్వపదాశ్రితుఁ జేకొనఁడో ప్రశిష్యునిన్





శ్రీహయగ్రీవాయనమః

# విద్యావిలాసము

## శ్రీకృతిపతిప్రస్తావన

క॥ శ్రితజనోద్ధృత్యై వలయు
జాతేష్టాశ్యామమూర్తి, సాఁహనుగాతన్
బ్రీతిన్, చిట్టాపెగ్గడ
సీతారామాంజనేయ బిహ్ముఁ, గృతిపున్.

మ॥ మనమున్ హేయసుఖాప్తికిన్ జొనుపకేమాత్రంబు దేవీవదా
ర్చనజాతామృతపేయసత్త్వవసదీక్షన్, "భక్తమూర్తి శివా"
యని, వేవేలుగఁబద్యముల్ నుడివి మాయాతీతవిజ్ఞానశ
క్తి నుపార్జించిన నిన్ను మెచ్చనగుఁగాదే! యాంజనేయాహ్వయా!

మ॥ కలికాలంబున నీకవీంద్రులకు సత్కారంబుఁగావించురా
జులు లేరన్నకొఱంతఁదీర్ప నెటులో శోధించి "విజ్ఞానమం
డలి" స్థాపించి స్వకీయశక్తి గుడివాడగ్రామసాహిత్యకీ
ర్తులు నల్దిక్కులఁబ్రాకఁజేసితివి నీతో సాటిగా రెవ్వరున్.

శా॥ ఆదిన్ శ్రీనరసింహారాయకవిగేహంబందు పీరుండ నే
దోదైవాప్తినినేను బోవనటనోహా! యన్ననోహా! యటం
చీదృక్సైత్రినిగల్పుకొన్నతఁడె నేనే, వారికీస్నేహము
ర్యాదాచిహ్నముగా మదీయనవకావ్యంబంకితంబిచ్చితిన్

ఉ॥ తాను రసజ్ఞుఁడయ్యెఁ, గవితారచనాచణుఁడయ్యె నిర్జనో
ద్యానమనోజ్ఞసౌధశిఖరాంతరసీమనివాసుఁడయ్యె వై
జ్ఞానికమండలీసభకు స్థాపకుఁడయ్యె బహూకరించె న
స్నినవకావ్యమంది యిదియేజననాంతరసౌహృదంబహో!

మ॥ అరయంగా దానొకసత్కవీంద్రుఁడయి నిత్యంబా శుధారామనో
హరతాదృక్కవితా విధానమునదివ్యస్తోత్రముల్ వ్రాసిచం
దిరనీహారతుషారహారసితసత్కీర్తిఁ సమార్జించెనే
సరసుండాతఁడెమత్కృతీశ్వరుఁడు నాసౌభాగ్యమేనాఁటిదో!

సీ॥ భక్తుండనీవను ప్రథకుఁ దార్కాణమా
తిరుపతిముఖ దివ్యదేశయాత్ర
వేదాంతినీవను విఖ్యాతికిని సాక్ష్య
మారహోదేశవాసానుభూతి
కవిరాజనీవను ఖ్యాతికి మూలమా
నవ్యాంధ్రగీర్నివానందలహరి
త్యాగినీవనుటకు నాధార మానవ్య
విజ్ఞానమండలీవిశ్వసేవ
గీ॥ అరయు వ్యవహారవేదినీవౌటచిహ్న
మగును శ్రీ 'దింటకుఱ్ఱు' కాయస్థపదవి
నరసభావుఁడవనఁగ దృష్టాంతమయ్యె

నీప్రబంధమునచ్చు వేయించుటన్న
నమలసౌజన్యగేయ రామాంజనేయ !

శా॥ సీతత్త్వంబు నెఱుంగఁ జూచుట దియెంతేఁ గష్టసాధ్యంబు వి
స్ఫీతైశ్వర్యము చేతనున్న మది, కించిద్గర్వమున్ భోగలీ
లా తృష్ణాప్తిఁ బునర్వివాహకలనాలాంపట్యమున్ జెందవా
నీ, తాత్పర్యమహోప్రశస్యమగుఁగాదే, రామాంజనేయాహ్వయా!

ఉ॥ ఈ నవకావ్యమేను ముగియించిన పిమ్మట ముద్రణార్థమె
వ్వానిని జూతునంచు, గుడివాడకుఁ బోయితి నొక్కనాఁడు కా
కానిఖిలప్రసిద్ధనయగౌరవపూరితహృత్సరోజినీ
శ్రీ నరసింహదంపతివిశేషపవిత్రపరిచయాప్తిచేన్.

ఉ॥ మా నరసింహరాయకవిమాన్యున కాతఁడు మేనమామయై
జ్ఞానికమండలీసువరివత్పరిపోషకుఁ డాంజనేయ వి
ద్యానిధి, ప్రౌఢభావకవితారచనుండు స్వకీయసుందరో
ద్యానవవీనసౌధమునఁ దావసియింపఁగఁ బోయి చూచితిన్.

ఉ॥ ఆ విభవాస్పదుండు నను, నావఁగరాని మహానురక్తి సం
భావనఁ జేసి, మత్కుశలవార్తను ముందుగఁ దానెఱింగి, మీ
రీవిధి నేగుదేరఁ గతమేమని, మీరసలెవ్వరంచు, మీ
పావననామమేమనుచుఁ బ్రశ్నలు వేసిన, నేఁ గృతార్థతన్.

సీ॥ శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతపీఠికా
సామ్రాజ్యమేలు వంశమ్ము మాది
శ్రీమదేకాక్షరాసనుఁడౌ తురగాస్య
దైవంబు నా కవితాగురుండు

మాకందమకరందమాధుర్యమొలికించు
బహుకావ్యరచన వ్యాపారసరణి
లలితసత్కవితాప్తి నలరారు కాకాని
నరసింహారావు పాత్రైకసఖుఁడు

గీ॥ సరససాహిత్యసాహిత్య సంప్రదాయ
నవనవోన్మేషభావార్థనవ్యకవన
వివిధసత్కావ్యవిదులు బంధుపుత్రులు నాకు
సమలకవితాప్తిగేయ! రామాంజనేయ!

ఉ॥ ఏపిలకేసుఁడేరఁ గత మేమన నన్ గుదిమెళ్లవంశ్యు రా
మానుజనామధేయుఁడని యందురు, ముక్తిపురాగ్రహారగ్రా
మీణుఁడ సంస్కృతాంధ్రములు మేదురసత్కవితాప్రణీత పా
చీనవీనభావవికచీకృతదివ్యకథాప్రబంధుఁడన్॥.

గీ॥ అమలవేదాంతతత్త్వామృతాంబురాశి
రాజ తిరువేంగళాచార్య రాఘవార్య
దేశికద్వయసత్కృపాదీయమాన
సాహితీసంప్రదాయ విశారదుండ.

మ॥ అరయంగా నాకవితాగుణంబు తురగాస్యాభిఖ్యదేవుండు, త
త్కరుణాప్తిన్, "మురళీవిలాస" మను సత్కావ్యంబగద్యంబుగా
సుసుల్ మెచ్చ రచించినాఁడఁదొల తన్, సంధ్యానటత్తాండవే
శ్వరకోటీరజటాటవీతటకటీస్యందన్నభోవాహినీ
ఝరఘుంఘుంరవతుల్యవాక్యరచనాసంరంభ మేపారఁగన్

శా॥ ఆకావ్యంబును రెడ్డి కంకితముగా నర్పింప లాభించె నే
వో కాసుల్పది, దానఁ గొంద అడరాదో? నీహయగ్రీవల
క్ష్మీశ్రీకాంతేశునకీప్రబంధము ధనశ్రీతృష్ణ నిస్వీడదో?
నీకీకృత్యమయోగ్యమంచనఁగ నేనీరీతి వాక్రుచ్చితిన్.

సీ॥ ఉభయభాషాకవితోల్లసద్వైదుషీ
నవమార్గుఁడైన నన్నయతపస్వి
సకలసంస్కృతసమాసవికల్పనాతోషి
తజ్జ్ఞానియైన పెద్దనయశస్వి
మోచాఫలాస్వాద్యవాచావిలాసాప్తి
ఘనుఁడైన ముక్కుతిమ్మనమనస్వి
సర్వమోహంకరసంస్కృతాంధ్రకవిత్వ
ధనుఁడైన రామలింగనవచస్వి

గీ॥ మఱియు శ్రీనాథప్రభృతులౌ మధురకవులు
నల భగీరథకథనథాయాతదివ్య
గాంగలహరీరయోపమకవనధాటిఁ
గృతుల రచియించి నరుల కర్పింపరొక్కొ.

ఉ॥ ఆవిషయంబటుంచు మసలంతటి దూరముపోవ నేటికి
న్నా! విబుధావతంసు లఘునాతనసత్కవు లెందఱెట్టి సం
భావనపూర్వకంబుగ, సెబాసన సత్కృతులన్ రచించి మో
దావృతవృత్తి మానవులకంకితమిచ్చిరొ చూడరాదొకో!

చ॥ తిరుపతి వెంకటేశకవిధీరులు మొన్నటివారు కాళికా
వరమపదాంబుజాతసముపాస్తివిశేషవిలబ్ధమాధురీ

భరితకవిత్వధోరణి సెబాసనఁగావ్యములన్ రచించి భూ
వరులను దత్కృతీంద్రులుగ వ్రాసిరి లోకమెఱుంగకున్న దే?

ఉ॥ ఆదృతిమీఱ లోకమవురా! ఎఱన, విస్ఫురదాంధ్రభాష, త
త్త్రాదృశదివ్యసత్కవనధాటి రచించిన వేదసన్నిభా
ష్టాదశపర్వభారతలసత్కృతి నర్పణసేయలేదె, శ్రీ
పాదకులీనకృష్ణకవివర్యుఁడు దాతల కంకితంబుగాన్.

ఉ॥ కావున, వీరికంతకును గారణమైన పెద్దవారలే
త్రోవను బోదురో? యిదియె త్రోవయనంబడు నావధాన నేఁ
బోవఁగనుంటిఁ బోవుదును, బోయితి మున్నె, త్వదీయశుష్కవా
చావిలవాదపద్ధతులనాపుము, పల్కకు మిప్పుడావిధిన్.

చ॥ "అరయ నరాంకితంబుగ మహాకృతినియ్యనివారు లేరె? శ్రీ
స్ఫురితకవిత్వధారగల పోతన, బాలకసాలవల్లవాం
కురసమమైన కావ్యమును గూళులకిచ్చుటపాపమంచు భా
సురమతి వ్రాయలేదె! యదినూచిన నీవిటు సాహసింతువే"

చ॥ అనియెదవేమొ తథ్యమిదియంతయుఁ గాని మఱొక్కమాట, నూ
తనకవితాప్తి వేళ నొకదండకమున్ రచియించె, సింగరా
డ్గణికనుఁ గూర్చి, పోతన, వికస్వరశైలినటంచు, శ్రీ సుధీ
జనము వచింపుచుండునది సత్యమొ, లేక యసత్యమో తుదిన్

చ॥ తినుటకుఁ దిండిలేక కవిధీరుఁడు పోతనయంతవాఁడు భో
గినివయి వ్రాసె దండకమొకించుకజంకక మున్నె, తన్మహో
ధనమునఁ గొన్నినాళ్లు నిజధామమునందు సుఖాప్తినుండి దా
గ్గొణిగెనటంట, హా పడుపుకూడు భుజించితినంచుఁ బిమ్మటన్

ఉ॥ వాదము సేయఁబోకుమిటు పల్కితినంచుఁ బ్రసంగమందు, నే
తాదృశ పోతనాఖ్యకవితావిషయైక ప్రసిద్ధగాథ యీ
మాదిరి దొర్లివచ్చె నొకమాటక్రమంబుగ సత్కవీంద్రమ
ర్యాద తెపోవ్రచుండఁ గృతినర్పణ సేయ గ్రహించుటుండెనే.

ఉ॥ వందలు, వేలు, లక్షలును వ్యాజ్యములాడగ, ఖర్చు సేయు నే
మందును, జాడులోకమకటా! నవకావ్యమునల్లినాఁడ మా
కందమరందసుందరవికస్వరభావకవిత్వధార నీ
వందునటన్న, నాకు వలదంచు వచించు రసజ్ఞుఁడయ్యు ల
బ్ధేందిరుఁ, డింక సత్కృతులనెవ్వఁడు సూచెడువాఁడు చెప్పుమా!

ఉ॥ ఆదివసంబులందు వసుధాధిపచంద్రుఁడు భోజరాజు, సం
పాదనఁ జేసినాఁడు కవిపద్యాల కక్షరలక్షలిచ్చి త
త్తాదృశకీర్తి పిమ్మట బుధస్తవనీయుఁడు కృష్ణరాయలా
మాదిరి పేరుఁ గాంచెఁ గనుమా యెటువంటిమహానుభావులో.

ఉ॥ ఏనుఁగుమీఁదఁ బెద్దనకవీంద్రుని, కాంచనరత్నకంబళా
సీనునిఁ జేసె నొక్కపుడశేషకవుల్గనియాడఁ దత్కవి
శానుఁడు కూరుచున్న విలసచ్ఛిబికం దన చేత నెత్తి స్కం
ధాన భరించెనట్టి కవితావసుధామహనీయరాజ్యల
క్ష్మీనుని కృష్ణరాయకవి నింకను గంటను జూడబోదుమే?

ఉ॥ ఆనృపుకీర్తి హంపిశిథిలాలయసీమలయందుఁ దుంగభ
ద్రానదివీచికాతతిపరిస్ఫురఘూర్ణజాయమాన ని
ధ్వానములందుఁ బ్రస్తరరథంబున జీర్ణకళావిశేషసం
స్థానమునందు నేటికిని జావకయున్నది చిక్కిశల్యమై.

ఉ॥ ఇంతకు నేనుమీకు వచియింపఁగఁబోవున దేమనంగ భూ
కాంతుఁడు విష్ణ్వభిన్నుఁడగుఁగావున వానికిఁ బారిజాతలా
తాంతమరందపేయకవితావరికల్పితకావ్యజాతి న
త్యంతముదంబుమీఱఁగ సమర్పణసేసిన దోసమున్నదే?

చ॥ అరయఁ బ్రబంధమున్ భగవదర్పణబుద్ధి రచించుసత్కవీ
శ్వరుఁడు మహాత్ముఁడేయగునుసందియమేమియు లేదు కాని, యా
వరుస లిఖించువారరుదు పందలు వేలు నరాంకితైకస
త్సరణిమెలంగుచుండ్రు కృతిసాగమినో భవమీఁద లేక యో.

ఉ॥ వేలకువేలు సజ్జను లవేలరతిన్ నడయాడుత్రోవ సు
శీలకుఁదావలంబగుచుఁ జెన్నువహించుచునుండుఁగాని దో
సాలకుస్థానమెట్లగు, విచారణసేయ నదూష్యమెద్ది వా
చాలతఁజూపెనందురు రసజ్ఞులు నేనిటుపల్కుచున్నచోన్.

ఉ॥ కావున నేను జెప్పునది కావ్యమునాదృతి జేయువాఁడె వృ
ద్ధ్వానలయానసిద్ధు కనిపించుట లేదనుచుండ మధ్య దు
ర్భావనచేత నీవు పిడివాదమొనర్తు విదేమికర్మ మ
య్యా!! వలదీ నరాంకితసమర్పణజన్యమిథోవివాదముల్

ఉ॥ లోకముచెడ్డదిప్డు మనలో మనమిట్టు పరస్పరంబు వి
ద్యాకలహంబుఁబెంచుకొని తాదృశకావ్యములందుగూడ చీ
కాకుగ దుర్విమర్శనము కల్పనఁజేసిన కావ్యసృష్టికిన్
లోఁకువ కాదె? నీకలములో మషియా విషమా వచింపుమా!

చ॥ కలమును జేతఁబట్టుకొని కల్పనసేయునువక్రిమింపల
క్షలకును మించు పద్యములు కాని, నిరంతరమానసవ్యథా

కులహృదయుండనౌచు భవకూపమునంబడి మున్గుచుంటఁ జే
శలకవితావిలాసినికి స్వస్తిని జెప్పితి మున్నె యెన్నఁడో!

ఉ॥ కాని పురాభవప్రణయగంధమిదేమొ వచింపఁజాల, బ్రా
చీనమతాభిలాషిణి, సుశీల సుభావ ప్రసాదసద్గుణా
ధాన, స్వతస్సుముగ్ధ కవితాలలితాంగి మదీయమానస
స్థానమునందుఁ గోమలపదంబులతో నడయాడు నెప్పుడున్

ఉ॥ ఏనిమిషంబునందు వరియించితినో కద నన్ను, దీనిమూ
లాన కులాంగనాస్మితవిలాసవిధాప్తికి వాచిపోతి, ప్రా
ణానికి సౌఖ్యమేమియుఁ గనంబడదాయెను, నిద్రలోన నీ
ధ్యానమె కల్గు నిద్ది కవితాసతియో? కవితాపిశాచియో!

చ॥ అరనిమిషంబుకూడ, హృదయంబున, స్వస్థతగల్గనీయదీ
కరణి, సుధాభమౌ కవిత కల్పన సేయును మాటిమాటి, కె
వ్వరికొ అక్రియయైన కవిభాగ్యము లేకిపుడెంతకాల మీ
ధరజరిగెన్ "నమోస్తు" కవితాగ్రహమా యన వీడదెంతకున్

ఉ॥ అక్షరలక్షలిచ్చు ప్రభువా కఱవాయెమొ కవిన్ గజోత్సవా
ధ్యక్షునిఁ జేయునట్టి కవితానిధి రాయలుగూడ దాఁటె తా
దృక్షుఁడొకండు లేఁడిపుడిఁ కేల, మనోహరకావ్యకల్పనా
పేక్షవచింపు మొక్కఁడు కవిశ్రమఁదీర్పఁగ నుండరాదొకో!

ఉ॥ ఈరమణీయకావ్యము నహీనహయాసనమంత్రిశక్తివి
స్ఫారితభావనాజలలసద్రసవత్స్వకపోలకల్పనా
ధారకధావిశేషకవితాబహుధారచనాప్రణాళికో
దారతఁ బూర్తిజేసితి, సుధామధురాశయ! పాఱజూడుమీ!

ఉ॥ కేవలకల్పనావిషయకీలితకావ్యము వ్రాయనేర్తు నా
ర్కా ! విమతేష్టదైవతమహోత్తమసత్కరుణాసుధారస
ప్లావితదృష్టిలబ్ధవరిభావరివర్ధితసంస్కృతాంధ్రభా
షావరసాహితీపటిమచాలని కింకవి యెన్నఁడేనియున్.

ఉ॥ కావున, నన్నెఱింగి కవికష్టముగాంచి నవీనకావ్యగా
థావిషయంబు నెంచి కవితాసరణిన్ పరికించి నామనో
భావము నాలకించి నరపాలవరేణ్యుఁడు లేనిలోటు వి
ద్యావర ! నీవు దీర్పగలవంచు దలంచితినంటి, నాతఁడున్.

ఉ॥ ఈ విషయంబు నెల్ల విని, యీషదుదంచితమందహాసరే
ఖావిమలీకృతోష్ఠుఁడయి క్రమత రాశిషమిచ్చి యో చిరం
జీవి ! త్వదీహ నేను వృథసేయుదునే యని సత్కరించె, న
న్నీవిధి, నూటికెచ్చటో, కవీశ్వరపోషకుఁ డీ దినాలలోన్.

సీ॥ శ్రీమదామ్నాయాంతసిద్ధాంతవిషయని
ర్వేలాత్మసాదు లార్వేలవారు
సామ్రాజ్యసంస్థానసాచివ్యగౌరవ
పాలనోదారు లార్వేలవారు
సాహితీసాహితీసవనీయసుకవితా
శ్రీలతాస్ఫారు లార్వేలవారు
స్థైర్యవీర్యౌదార్యధైర్యగాంభీర్యాది
లాలితాకారు లార్వేలవారు

గీ॥ త్యాగలీలావశీకృతాశాంతముఖ వి
శాలసుయశోవిహారు లార్వేలవారు

అట్టి యాఁ శ్వేలనామ శాఖాంతరమునఁ
గూడియున్నది, హారితసగోత్రమొకటి.

క॥ ఆ వరగోత్రాంతరమున
భూవరసాచివ్యధర్మపోషణవిధిచే,
"తీవిలు" చిట్టాప్రెగ్గడ
పావనవంశంబు కలదు పండితులెన్నన్.

ఉ॥ ఆమహనీయవంశకలశాంబుధి కిందుఁడునా జనించె శ్రీ
రాములు, పాపబంధకవిరాములు, సస్మితవాక్ప్రమత్క్రియా
ధాములు భక్తిబోధనవిధానవశీకృతసర్వదేవతా
భూములు, దివ్యకాములు, తపోబలసంస్తవయోగ్యశీలులన్

ఉ॥ ఆ జనవంద్యమూర్తి జనానంతరపుణ్యముమంచిదౌట, వీ
రాజు, నియోగివంశజలరాశిమనోహరపూర్ణిమాకళా
రాజు సమస్తభోగసురరాజు కవీశ్వరభోజరాజు శ్రీ
రాజు నితాంతధైర్యనగరాజు జనించెను దివ్యతేజుఁడై.

కం॥ ఆ రమణీయాత్ముఁడు, సొం
పారఁగఁబెండ్లాడె, చుక్కమాంబను భక్తి
స్ఫారకవాచాధారా
హారపాత్రిచర్యకలిత హేరంబాంబన్

సీ॥ రాజేంద్రుఁడా! కాదు, ప్రతిదినాతిథులకు
వర్పించునిష్టమృష్టాన్నములను
భోజుఁడా! కాదు, సద్బుధకవీశ్వరపాళిఁ
జేర్పించి సతము పూజించుచుండు

సద్భక్తుఁడా ! కాదు, జప్యమంత్రమ్మదో
తపణించు దివ్యకాంతయువ సతము
విద్వాంసుఁడా! కాదు, వేదాంతసిద్ధాంత
రీతి సత్సభలఁజర్చించుచుండు

గీ॥ పూర్వజన్మంబునందు నపూర్వమైన
యోగ మొనరించి యేదో శాపోక్తి కతన
పుడమి వెలసిన యొక దివ్యపురుషుఁడనఁగఁ
బోలు వీరాజు కవిలోకభోజరాజు.

క॥ ఆతని తనయుఁడు దేవి
స్ఫితార్చాఫలవిశేషవికసత్కవితా
ప్రీతిదుఁ బోధనభాగ్యుఁడు
సీతారామాంజనేయచిహ్నితుఁ డితఁడే.

సీ॥ వేదవేదాంతార్థవిపులీకరణదక్ష
జన్మాంతరాత్తసంస్కారబలుఁడు
పరిణతగోస్తనీఫలసుధారసమాధు
రీనిభకవితాపరిచయుండు
భవ్యదేవీపదోపాసనాసంలబ్ధ
వాచామగోచర వైభవుండు
'విజ్ఞానమండలీ' విద్యాకార్యక్రమ
ప్రౌఢనిర్వాహణధురంధరుండు

గీ॥ పండితప్రియుండు, మధురసంభాషణుండు
శాంతిసుగుణాభిరాముండు, సహృదయుండు

"చిత్రవింశతి"ముఖవరస్తోత్రకర్త
ఘనధనశ్రీవిహర్త మాకావ్యభర్త.

గీ॥ అతని సహధర్మపత్ని విద్యానిధాన
వైభవనిదాన భర్తృసేవావధాన
భక్తివిశ్వాసమితసాంబ భవ్యగుణాక
రంబ! శ్రీచిట్టి వేంకటరత్నమాంబ.

ఉ॥ చీకును జింత లేని సుఖజీవన ముజ్జ్వలమైనయాంధ్రభా
షాకవితావధానము విచారము లేని ధనాగమంబు పే
ర్మాకులమైనమానస మహోయసమించు నియోగివంశ మౌ
రా! కలి సిట్టి దంపతిపరస్పరబంధము నాటికెచ్చటో !

మ॥ ఉభయుల్ గూడి కవిత్వముల్లుటకునై యుత్సాహమేపారఁగా
నభిరామద్రుసరోవరాంచితగృహోద్యానాంతరాసీనులై
"శుభమాస్తా"మని, భర్తముందు పథమున్ జూపింపమోచాసుధా
నిభవాచారుచిఁ బద్యమెల్ల సతి తానే చెప్పెఁ జిత్రింబుగన్.

శా॥ ఆసారస్వతతత్త్వ మాప్రియయువిద్యాసూత్రసిద్ధాంతవా
చాసర్వస్వము నాకవిత్వకలనాసాహిత్య మాత్మాగతే
ఖాసౌందర్యవిశేష మాయతిథిసత్కారక్రియానోన్యవి
భాసౌభాగ్యము నాసతీపతులలో సాఫల్యమందెందుఁబో !

శా॥ కానీ, మంచినిజూచి, మాత్యాగసత్కాలంబు కాదివ్వదే
రా, నాచిత్తముగాల్చు నీ విషయ మబ్బా యెట్లు వాక్రుచ్చెదన్
పోనీ, చెప్పకమానుటా యుచిన నేమౌ కాదుకాదంచు లో
లోనన్ గొప్పబలాత్కృతిన్ సలిపె దేవో! నఁబరోక్షంబుగాఁ

ఉ॥ అంపపుఁగోఁతకన్నను, హాలాహలపానముకన్న, నగ్నివేం
డ్రింపుల కన్న, లోనవికటించిన వ్యాధులకన్న, జీవముల్
చంపు శతఘ్నికన్న వ్యధసల్పును వేంకట రత్నమాంబహృ
త్కంపము సేయు దుర్మరణ దారుణవార్త యెఱుఁగువారికిన్.

సీ॥ కామేశ్వరీపాదకమలార్చనక్రియా
మాహాత్మ్యమెల్ల నేమంటఁగలసె
దైనందినాతిథిదైవపూజాలబ్ధ
పుణ్యవిశేషమే బూడిదయ్యె
కవితాసరస్వతీకల్పితోత్తమకావ్య
విబుధతత్వం బెందుఁ బెంకులయ్యె
పాణిపీడనకాలబ్రాహ్మణఘనజటా
ధాట్యాశిషంబ దేమొటఁగలిసె

గీ॥ మువ్వదేండ్లైన మించక పూర్వమందె
పాడుమృత్యువు నోటిలోఁ బడితివీవు
భక్తివిశ్వాసనుతసాంబ భవ్యగుణక
రంబ క్రిచిట్టి వేంకట రత్నమాంబ.

మ॥ పదిరెండేండ్లు గతించు నీనడుమ నబ్బా! యెన్ని త్వద్భర్తృస
ద్హృదయంబందున నగ్నిపర్వతములిట్టే బ్రద్దలైపోయెనో
ముదితా! త్వద్విరహవ్యథార్త పతిదృక్పుష్కరాస్రధారాప్తిచే
నదిగో! పల్వలమయ్యె నేఁటికి, గృహోద్యానంబులోఁ జూచితే.

మ॥ కలమా! వ్రాయుడు, చిత్రమా! పడకు, వాగ్గాద్గద్యమా! రేఁగు, లో
దలఁపుల్ జ్ఞప్తికి రావు వేళకు, దృగంతంబులఁ శుగ్రసోదకం

బుబు న్మష్టింపను మాటిమాటికది యేమో! చిట్టిరత్నమ్మ! నా
తెలిసెన్ యుష్మదకాలమృత్యుఘటనాంధీభూత చేతోవ్యథల్.

శా॥ నీవా కంటికిగానరావు కలలోనేకాని యేరాండు లో
నావంతేనియు దుఃఖభారమది యమ్మా! పోదు నీభర్త శి
ష్టో! విశ్రాంతి వచింపుమీ యికను; నీలోనున్నయాదివ్య వి
ద్యావైశద్యమదేమి? లేనిమెడ నాతం డిట్టులైపోవునే?

మ॥ మరలన్ బెండిలియాడ నేననుచు భీష్మప్రిజ్ఞఁ గైకొన్నవాఁ
డరశే! బెండిలిపైన బెండిలిని సేయంబోవ సిద్ధంబుగా
నరుదెంచెన్ ప్రియుఁ డన్నకోవ మెదనమ్మా వద్దు నాకావ్య సుం
దరికిన్ నీకును భేదమున్నె చెవుమా! తాల్గాణ మేమందువా!

కం॥ ఆరయఁ గలలోనైనను
దారద్వయదోషమొల్లఁ దలవని ప్రజ్ఞా
ధీరుఁడు నీ ప్రియుఁడమ్మా
యేరీతిగ సంభవించు నీకృతిఁ గొనుటల్.

చ॥ సరసగుణాలవాల విలసత్కలభాషిణి సుందరాతిసుం
దరమృదుభావ కోమలపదక్రమభాసుర కావ్యకన్యఁ దా
నరసి, త్వదీయరూపమట నంతయుఁ జక్కఁగ గోచరింపఁగాఁ
బరిణయమాడు సమ్మతికిఁ బాల్పడె నవ్వడె కాదె! ధీమతీ!

కం॥ ఎతత్కావ్యకుమారిని
బ్రీతిన్ నీ చేత నిపుడు పెట్టితిఁ గొనుమీ
యేతీరునఁ గన, నీకా
సీతారామాంజనేయ చెప్పుట హితముల్.

మ॥ ఇది, శాఖాంతరమా వివాహమది కాదే, కాకపోనీ, సుధా
హృదయా! నా కృతికన్యకామణికి నీవే భర్త వేమందువా!
పదవిన్యాసమునందు ఛాందసవిధిన్ ప్రౌఢార్థవాఙ్మాధురీ
పదవిన్ సద్గుణరీతి మీ రుభయుల్ బాంధవ్య మొప్పించుటన్.

గీ॥ విలసదుత్పలచంపకాదులను బూజ
సేసి గీతాలు పాడి యాశించె నిన్ను
శివుని లబ్ధిని దుర్గ భజించి నట్లు
నాదు కృతికన్య దివ్యవిజ్ఞానధన్య!

శా॥ ఆచారవ్యవహారపద్ధతులతో నాజన్మశుద్ధాన్వయ
శ్రీచాతుర్యముతో మనోహరకళారేఖావిలాసంబుతో
మోచాపక్వఫలస్రవన్మధుఝరీప్రోన్మగ్నవాగ్రీతితోఁ
దూచా తప్పని కట్టుదిట్టముల నీతో సాటి రావచ్చు నో
ప్రాచీనాన్వయసంప్రదాయకలనాపారీణ! నాకన్యకన్.

సీ॥ పలుకనే పలుకఁడు, పలికెనా! యది శిలా
క్షరముగా ధర చిరస్థాయియగును
చూడనే చూడఁడు, చూచెనా! యది సుధా
వృష్టియై, హృదయసంప్రీతినిచ్చు
చెనకనే చెనకఁడు, చెనకెనా! యది మహా
బ్రహ్మాస్త్రమై రిపువ్యధ నడంచు
చదువనే చదువఁడు, చదివెనా! యది విపం
చీగానమై, సుఖశ్రీనొసంగు

గీ॥ పలువిధంబుల వ్రాయనే వ్రాయఁ డెప్పుడు,
వ్రాసెనా! దివ్యకవనంబు బయలువెడలు,

మనసు చలియించఁజేయు సంపదలున్న
వికృతిఁజెందని యొక తపస్సుకృతి యతఁడు.

ఉ॥ కామవిరాగితాద్రఢిమ గ్రామణికత్వము ప్రౌఢపాణిభా
షామృదుసాహితీవిషయసాహితి సంస్కృతభాషితీకలా
స్వామిత వైదికార్థవిలసత్కవితారచనాధురీణతా
సామము మూనదార్చనము నాతనియందె ఫలత్వమొందెఁబో.

మ॥ ధనధాన్యంబులతోఁ యశోగణాతో దాంపత్యధర్మంబుతోఁ
బ్రణయాలోకనభాగ్యవైఖరులతో వైదుష్యవాదాలతో
కవిదవ్యాజవచఃప్రసంగములతోఁ గాత్మ్యాయనీభావనా
జనితశ్రీనిధి నిత్యమీయుభయు లాచంద్రార్క మిట్లుండెడినౌఁ

## షష్ఠ్యంతములు

క॥ ఏవంవిధగుణనిధికిన్ దేవీపాదాబ్జభక్తిదీపితవిద్యా
ధీవిధ సార్జితకవితా పావనసౌశీల్యమునితవందితమతికిన్.

కం॥ వేదాంతాగమచింతా పాదిన వైరాగ్యవిషయపావనమేధా
వైదుష్యారాధిత తత్త్వాదృశవర మార్గవిషయతత్త్వార్థసకున్.

కం॥ ఏతద్ధరితసగోత్రోద్భూతునకును, చిట్టిరత్నపుణ్యావతీవి
ఖ్యాతర్పితమానసునకు సీతారామాంజనేయచిహ్నితఃవికిన్.

గీ॥ భవ్యరామేశ్వరీపాదపద్మయుగళ
నిర్భరోపాసనాక్రియానియతమతికి
నాయురారోగ్యవృద్ధిగా నస్మదీయ
కృతికి గాధావిధాక్రమం బెట్టిదనిన.

# అభీష్టదేవతోపాస్తి

కం॥ జ్ఞానానందకలాదిని
ధానా! కరుణానిధాన! తర్పితదీనా!
శ్రీనా! హయముఖలసదభి
ధానా! మదుపాస్యమానతత్త్వాధీనా!

కం॥ శ్రీమద్ధయముఖజయని
స్సీమప్రాభవ విశేషసేవితహేషా
భూమప్రీణితవిద్యా
ధామా! మదుపాస్యమానతత్త్వోద్దామా!

కం॥ శ్రీమత్త్రారగకంధర
నామా! కరుణార్ద్రవీక్షణకలితభక్త
స్తోమా! హామకమానస
ధామా! వేదాంతవేద్యతత్త్వోద్దామా!

కం॥ అయి! హయముఖ! బహుకుమతి
స్మయహారకరుణారసార్ద్రమధురాలోకో
దయసంవర్ధితకవివా
ఙ్మయ! మే, విజయీభవాద్య మనసి మహాత్మన్!

కం॥ హయవదనవాగధీశ్వర!
జయ, జయ, మే, మనసి, సపది, జ్ఞానానందా
శ్రయ! నిగమాంతసమాద్యో
దయ! సురకోటీరరుచిరుదార! మహాత్మన్.



శ్రీ హయగ్రీవ స్వామినః

# — విద్యావిలాసము —

## ప్రథమోల్లాసము

౧. శ్రీ తరుణీ హృదయేశ్వర
శీతలకరుణాప్రవాహసించితపీఠా
రతినిరస్తాపాయా
సీతారామాంజనేయ చిద్ఘనగేయా!

చ. కలదొకపల్లెటూరు కలికాలమలాపహజాహ్నవీతటీ
కలితకుటీరమై నయనకౌతుకదాయకమై, ధనేందిరా
విలసనపాత్రమై, సురభిబృందనిషేవితమై, సరస్వతీ
లలితపదాబ్జనూపురఘుళంఘుళరావవిలాసదీప్రమై.

ఉ. వేదపురాగ్రహారమను పేరునఁ గాంచి దిగంతకాంతతా
త్రాదృశకీర్తి గల్గి జనతాస్తవనీయఘనాపదానగా
థాదరణీయమై, బహువిధప్రసవద్రుమపంపరాప్రసూ
నోదయమానగంధకలితోభయపార్శ్వగరాజమార్గమై

ఉ. స్నానము పానముం సలుప సన్నిధిలోన స్రవించుచుండు గం
గానది పాయ, తీరసహకారముఖద్రుఫలప్రసూనగు
చ్ఛనతలంబులైన విటపాగ్రవిధావిపిధావరోధవి
చీసిచయప్రచారరయశీర్ణమహీయుగవిహారమై

ఉ. ఆపురమందు శ్రీగురుకులాశ్రమమన్న కుటీరముండె నా
లోపలిభాగమందు నతలోకమహోదయునఁ గానుపించుఁ జూ
డావరికల్పితప్రసవసౌరభవాసితరత్నపీఠసం
స్థాపితశారదాప్రతిమ చక్కఁదనంబిదెకఁ జెప్పశక్యమే.

ఉ. శారదపూర్ణిమామధురచాంద్రిని మించు శరీరకాంతి, క
ర్పూరపు దీప్తితోడ సరిపోల్పఁగవచ్చు సుమస్మితంబు, బా
లారుణభానుపుంజలసదబ్జముతోఁ దులఁదూఁగు మోము, నై
రా! రమణీయతాఖని సరస్వతివిగ్రహ మాశ్రమంబునన్.

చ. ఉదయదుదగ్రసారధిమహోజ్జ్వలశోణమరీచిమాలికా
పదకలనాధగద్ధగితబంధురకాంచనభూధ్రమౌళి సం

వదను బరిహసించుచును భాసిలుచుండు మహామణీగణా
స్పదమగు శ్రీకిరీటము సెబానన శీర్షము నందె, యెప్పుడున్.

చ॥ అరయ శిరఃప్రదేశమున నాగమభాష్య మనర్ఘసుందరా
భరణముగాఁ జెలంగఁ గరపద్మమునందు సమీపవాహినీ
దరపవనక్వణన్మధురతంత్రుగవల్లకి సత్తమస్వర
స్ఫురణమునీన నుంచునబమూర్తిమదాగమతత్త్వమోయనన్.

ఉ॥ ఆరయఁ దూర్పునందు నవకాకృతితో నుదయించునట్టి బా
లారుణబింబమో యన నహా! యను కుంకుమబొట్టు పాటల
శ్రీరమణీయఫాలమునఁ జిందులుద్రొక్కఁగ, మించు శారదా
కారము నూచువారికిఁ గల్మషబంధము వీడకుండునే ?

ఉ॥ పామరుఁడైన వాఁడపట భక్తి నమస్కృతిఁ జేసెనేని వి
ద్యామహనీయుఁడౌనఁట తదర్థమె తన్మహిమాక్రమస్థలీ
సీమకుఁ జేరి కాంచెద రశేషకళార్థులు శారదాపద
శ్రీమదుపాసనావిధివిశేషము చేత సమస్తవిద్యలన్.

ఉ॥ స్నానముఁ జేయ భూసురు లుషస్సమయంబునఁ జెంతనున్న గం
గానదికేగి, భంగతతిఘట్టనబుద్ధతటీప్రదేశని
ర్ఘ్రాణము శ్రీకరంబమధురస్వరముల్ విని సైంహపూర
ధ్వానమటంచు భ్రాంతులయి వత్తురు క్రమ్మర మెట్లమీఁదికిన్.

చ॥ అరయఁగఁ గల్యవేళ, నమలామరవాహిని స్నానమాడ సుం
దరపురకామినీజనము తత్సమయస్ఫుటదంబుజాటవీ
చరదలినీముహుఃపతనసంభ్రమపీడితవక్త్రధూననాం
కురితకపోలలోలమణికుండలకాంతులఁ జూడనొప్పడున్.

చ॥ ఉపహితరక్తితోడఁ గరభోరు నిశీథిని వేదపాఠ వా
గ్లపనత నున్న భర్తను జిరాకున నావలఁద్రోచి చీకుతో
నపముఖయై పరుండెడియు, నిశాంతపువేళ, వియున్నదీమరు
త్స్నపితసరస్వతీకరవిశాలవిపంచిక మ్రోయ లేచి తా
నపుడు కవుంగిలింపనతఁ డయ్యెయొ బ్రాహ్మముహూర్తమిద్ధమున్.

ఉ॥ బారులుదీర్చికట్టఁబడు బ్రాహ్మణపర్ణకుటీరపాళి, ము
క్కాఱునఁబండుభూములు, జగజ్జనపావనముఁబొప్పు జాహ్నవీ
తీరము, శారదాజనన దేశము, సంస్కృతపాఠశాల, బం
గారమువంటి మేటికవుల కాంతలు, పండితులైన విప్రశ్రీ
ధారణి, స్వర్గమిట్టు లవతారము దాల్చిన దేమొ చూడఁగన్.

ఉ॥ ఆరమణీయమహా గురుకులాశ్రమమందు మహాత్ముఁ డొక్కఁడా
హారవిహారపావనశయనాదులయందును శారదాపదో
చ్చారణసేయుచున్ దమవశంవదుఁడౌచు సమస్తవైదికా
చారపరాయణుండయి ప్రశాంత మనస్కుఁడునుండు నెప్పుడున్.

ఉ॥ ప్రాంగణదేశనిస్సరదభంగురతుంగతరంగగాంగవా
స్సంగసమంగళానిలవశంవదసౌరభలబ్ధి నుల్లము
ప్పొంగఁగ శిష్యసంతతికి నొక్కొకనాఁడు సమస్తశాస్త్రపా
రంగతుఁడైన యా విబుధరాజు పఠించును వేదభాష్యమున్.

ఉ॥ ఆతని వేదమీమాంసయు మద్భుత మెవ్వరు వాని విద్యలో
లోఁతు నెఱుంగలేక మదిలో నిటు భావనసేయుచుందురా
నీతఁడు నీశ్వరాంశమిది నేఁడు కనంబడెనంచు కాశిలో
భూతలమందు నిప్పటికిఁ బోలిన పండితుఁ డొక్కఁడుండెనే?

ఉ॥ శాపవశంబుచేత నిటు జన్మముఁ దాల్పఁగ వచ్చెనేమొ? బ్రా
హ్మీపురుషావతారమని మేదిని జూచినవారలెల్ల లో
లోపల సంస్తుతింప మణిరోచితదారుసువర్ణపీఠికా
స్థాపితశారదాప్రతిమసన్నిధిలో నిలుచుండు నెప్పుడున్.

చ॥ అతని పవిత్రపాదజలజాంతికసీమఁ గళాభిలాషిసం
తతులు పరశ్శతంబులు సదా విడనాడక యుండ్రు శారదా
సతి కృప నేలుచుండనట సంస్కృతభాషయె దేశభాష గో
తతిధనమే ధనంబతిథితర్పణమే వ్రత మా యశస్వికిన్.

ఉ॥ ఆయనఘస్వభావమహిమాంతయుఁ జిత్రము చూచువారి కా
మ్నాయమహావతారమను మానసమున్ గలిగింపఁజేయు భ
ద్రాయితమూర్తి తద్వదనరమ్యకళాస్థితి విప్పిచెప్ప తే
వాయెను వాఙ్మయాన సరియైన పదాలొక కొన్నియేనియున్.

చ॥ ఉదయము నిద్రలేచి సరిదూర్మిజలంబుల స్నానమాడి శా
రదకు సపర్యసేసి యెదొ వ్రాయఁగఁ దా మొదలెత్తుఁగాని, లో
సదనమునందునున్న కులసాధ్విని మాతనయావనోదయా
స్పదను గలాభిరామ నొకసారియుఁ జూడఁడదేటి శాపమో!

గీ॥ పదియు నారేండ్ల చిక్కని పడుచుఁదనము,
కంటికింపును గూర్చు చక్కఁదనంబు,
ఓర్చుకొనలేని నూత్న మోహోదయంబు,
కాంతుఁడు పరాఙ్ముఖుఁడు, క్రొత్త కాపురంబు,
బ్రదుకునే సతి యీదృశావస్థనున్న?

చ॥ సరసిరుహాననాననగు చక్కని మోమున మూగియున్న పెం
 గురులను బైకిఁ ద్రోయుదది కోపము లేక విషాదమో? తిర
 స్కరణమొ భర్తృమానవమి విచారమొ సంతతిచింతయో మఱే
 కొఱంతయొఁ గారణం బెఱుఁగఁ గొన్నిదినంబులదాఁక నామెకున్

సీ॥ బహుదీర్ఘనిశ్వాసభరకవోష్ణత చేత
 నరుణాధరకిసాల మట్టివాడె
ఆహారవినిమయాత్యంతకార్శ్యము చేత
 దనువల్లి కుసుమవిధాన నలిగె
అతిరోదనావిధాయాస్యవైఖరి చేత
 నయనవీక్షణలౌల్యనటనఁ బాసె
సంస్కారహైన్యాతిచపలాలకాళిచేఁ
 గ్రమాస్యకాంతి నగంబు నమసె

గీ॥ సంతతాశ్రుప్రవాహసంస్రవము కతనఁ
 బాలుగారెడు చెక్కిలి శ్రీలుడిగె
 జిక్కువడి వేణి పిడుదులఁ జేరనిలచె
 బుణ్యశీలకు భర్తృవైముఖ్యలబ్ధి.

ఉ॥ ఎన్ని వసంతముల్ గడచె నెన్ని నభోజలదంబు లేగ నె
 న్నెన్ని శరత్తులాయె బయ నెన్ని రహోనిశలట్టిదాటె నిం
 కెన్ని వయోఋతుస్నపన హేతుమహాశలు శూన్యమయ్యె దా
 నెన్నఁడు భర్తవల్ల సుఖమొట్టిదో! పాప మెఱుంగదింతకున్.

చ॥ మదనకళావిలాసముల మర్మ మెఱుంగఁడొ లేక ఛాందసా
 భ్యుదయమొ! కాక కౌవఫలపూర్తియొ? లోకవిరక్తియో మఱే

మది విషయాభిలాషలకు నెలవయి దాచి కృశించు ప్రేయసిన్
వదలెఁ బ్రియుండు సంపెగను బంభరరీతి నిదేటిధర్మమో!

చ॥ మిసమిసలాడు యౌవనము మేలిమివంటి శరీరకాంతి నె
న్నొసటి పసందు దృష్టుల మనోహరలౌల్యము శారదేందు బిం
బసదృశమైన మోము నెలప్రాయముగల్గిన ముద్దరాలు, ప్రే
యసి విసమయ్యె భర్తకకటా! శివమూర్తికి కేతకీ విధిన్.

సీ॥ చైత్రమాసమునందుఁ జరుగు నూతనవధూ
వర మిథోయోగ వైభవముఁ దలఁచి
వైశాఖమాసాంత వాసరాంతములందు
విరియఁబూచిన మల్లెవిరులఁ జూచి
ఆషాఢమేఘోదయానందమునఁ గుల్కు
మొగలిపువ్వుల గంధములకుఁ బొంగి
కార్తికోషస్సంధ్యఁ గళలీన వికసించు
మృదుసరోజాతసంపదల నరసి

గీ॥ ప్రతిదినోత్కర్షయౌవనారంభజృంభ
దవయువస్ఫూర్తి విక్రుతుల నాపలేక
భర్త్రవైముఖ్యమునకుఁ దాఁ బడినబాధ
హృదయమందున్న మన్మథుఁ డెఱుఁగు నేమొ.

ఉ॥ అప్పగిదిన్ దదేకనియమాస్పదబుద్ధి రచింపసాగెఁ జి
న్నప్పటినుండి తానొక మహత్తరనైగమసూక్తిటీక విం
కెప్పుడు పూర్తియౌనొ? ప్రియ యెన్నఁడు కామసుఖాల దేల్చునో
యిప్పటికే సగంబు గతియించెను ప్రాయము తానికామెకున్.

చ॥ ఒకదినమందుఁ దద్దయుతుఁ గొంటిరివేళఁ దదాశ్రమస్థలీ
నికటరసాలభూరుకటవనిర్మితపర్ణకుటీరబాహ్యవే
దిక పయిఁ గూరుచుండి వితతీకృతదృష్టిఁ దదేకదీక్షనై
దిక్కృతిఁ దాను వ్రాసినది తెచ్చి విమర్శనసేయుచుండఁగన్.

ఉ॥ శ్రావణమాసమాటనది చయ్యన నాకసమందు నంతలో
నే వితతాంబువాహము లనేకము లొక్కట సంక్రమించి, గ
ర్జావిధులన్ వియోగులఁ గలంచుచు వృష్టికుపక్రమింపఁ బోఁ
బోవుచు నొక్కవ్యక్తి తన ముందు కనంబడె, సందెచీఁకటిన్

ఉ॥ అప్పుడు దృష్టినిల్పి యెవరక్కడనన్న, మహాత్మ! నేను చి
న్నప్పుడు పెండ్లియాడి స్వగృహార్చనకుం దినవాసురాల గం
గాప్పున కేగుచుంటి నను నందురు ధీమతిగా వయస్సునా
కిప్పుడు ముప్పదుండునన నేమి! యహో! సరి యట్లులాయెనన్.

చ॥ కనుఁగవ నాఱు నీరపుడు కమ్మని చెక్కులఁ జాఱఁగట్ట నా
ధుని చరణాలమీఁదఁబడి ధూళిమలీమసవస్త్రయుగ్మధా
రిణి కలనాప్రదర్శితదురంతవియోగభరార్తి నామె మె
ల్లన నిటువల్కెఁ గోకిలగళస్వరముగ్ధతరాస్ఫుటోక్తులన్

శా॥ ఆజన్మాంతము వేదకోశకలనావ్యాసక్తి కేకాని నా
థా! దాంపత్యసుఖానుభూతికిఁక లేదా! తావు నీతోన నే
రాజన్ నే సహియింతు నీ నిశి నభోవ్యోమాబ్ధమున్ జూచి నా
దీజాయత్వము కానిపో నుడువరాదే? యేల! మోమోటముల్

ఉ॥ పాయములో సగం బడవిబట్టిన వెన్నెలపోలె వ్యర్థమై
పోయెను, నాథ నీకతన ముచ్చటలాడవు మోముసూడవ

న్యాయముగాదె నాథ? హృదయంబును గల్గినవాఁడవేని స్వ
ప్రేయసి నీ విధాన విఫలీకృతయౌవనసౌఖ్యఁ జేయుదే!

ఉ॥ ఎండిన మోడుగూడ మొలకెత్తుఁగదా! యిపుడీ నభోనిశో
ద్దండ తమఃప్రవృష్టిజలధారకు మీ మనమొండుగాక యే
ముండిన నేమియా హృదయమున్న సమస్తము వేద్యమౌను మి
మ్ముండనరాదుగాని కరముంచుఁడు నాయెద నెట్టుప్రీతినో!

సీ॥ కాంచవైతివి కల్యకలితపూజాంభోజ
కరరుహాలిఖితమద్విరహాగీతి
అరయవైతివి సంతతాశ్రుధారాకృష్ట
శోణస్థలకప్రోష్ణచందనంబు
పలుకవైతివి మనస్స్వస్థతాహీనతా
దర్శితాభ్యుత్థానకార్శ్యమునకు
చెనకవైతివి సాంధ్యఘనజపాచితవస్తు
సంభారవినిమయశౌర్యమునకు

గీ॥ పిలువవైతివి యొకసారి పేరనైన
నెట్లు బ్రదుకుదు నీ బాధ నెట్టులోర్వఁ
దపము సేయుఁగ నీలోనఁ దలపులున్న
గూడునే నన్ను బెండ్లాడి గొంతుకోయ.

సీ॥ అతనుజ్వరము చేత నతఁజెందునపుడైన
నింత నాపై జాలి నూనవైతి
పిడుగుపాటున కేను వెఱగందినపుడైన
సరభసాశ్లేషలనరయవైతి

కొంటెపాటున నింటనుండినయప్పుడైన
నోరార మాటాడనోర్వవైతి
గృహకృత్యభరముచే నెడరుచుండినయప్పు
డిష్టసూక్తులను మన్నింపవైతి

గీ॥ పాదసంవాహనముఁ జేసిఁ బ్రియుఁ గదలఁప
నిందునకుఁగూడ సమ్మతినీయవైతి
పట్టిభర్తను బ్రేమించు యొప్పుకంటె
గంగమడుగునఁబడుట మేల్గాదెనాథ!

చ॥ అని పతిపాదపద్మముల కంజితభక్తి నమస్కృతిన్ బ్రద
క్షిణమొనరించి తా నిటలసీమఁ గరాంజలిగీలుకొల్పి లో
చనయుగళీచ్యుతాశ్రుకణసంస్రవసిక్తకపోలయై యా మె
ల్లనఁజనఁ జేంబిల్చె నెవరో! యని వెన్కకుఁజూచె నాతఁడున్

ఉ॥ ధీమతి నను పిల్చితివిదే? యొకమాట నిమేషకాలమీ
సీమను గూరుచుండుమని చెప్పి నవస్ఫుటపత్రపంకజ
క్షేమము నాహరించు వికచీకృతదృష్టిఁ బారజూచె ప్రే
మామృతవాహినీలహరి నాపెను ముంచుచు లేవనెత్తుచున్.

ఉ॥ ధీమతి! నీవు నిక్కముగ ధీమతివే సుమి సంశయింపఁగా
నేఁ బతియొక్కమాట నను నీవు వివాహమునాఁటినుండి నీ
నామము నింతకాలమును నారచియుంచిన గొప్పవ్యక్తికన్
ధీమతియన్న పేరిడెద దేవి! విచారము మానుమింతటన్

ఉ॥ పండితలోకమెల్ల భళి బాగన వ్రాసిన నాదువ్యాఖ్య భూ
మండలికీర్తిగాంచుతఁ గ్రమంబుగ ధీమతియన్నపేర, నో

యుండజయూన ! నాదు జననాంతరపుణ్యము మందిదాట నీ
యుండ లభించె నీ ఘనత సంతతిగ్రంథము వ్రాయఁగల్గితిన్.

చ: ప్రియుఁడు కవీశ్వరుండ యనఁ బ్రేయసికిన్ యశమబ్బఁ గానిచోఁ
బ్రియ కవయిత్రియైనను లభించును గౌరవమింటివాని కో
నయవతి! నీకు నాకతన నాకును నీ కృపఁ గల్గె నీ ప్రథో
దయము సతీ మహోక్కటినుడి దాఁపక చెప్పెద నాలకింపుమీ.

ఉ॥ కామము నీకు నాకు మదిఁగల్గినఁగాని ప్రయోజనంబు లే
దో! మదిరాక్షి! యింక నదియొక్కటిమాత్రము కోరకుండ నీ
వేమి వచింపనున్న నదియే యిదె నిక్కము వేడియుంటి నో
ధీమతి! హేతువేమనఁగఁ జెప్పెదఁ బ్రాగ్భవశాపలబ్ధమే.

చ॥ అరయఁగఁ బూర్వమందు భవదాకృతి పౌరుష మేనుగాంత ని
ర్భరము సతీపతిప్రథను బొందితి మప్పుడు నీవు శ్యామసుం
దర సముపాసనానియమధారణధూతభవాభిలాషదు
ష్పరిణతి నొల్లవైతి ననుఁ బ్రార్థనఁ జేసియు నిష్ఠ వ్యర్థమై.

ఉ॥ ఈవిధి శాపమిచ్చితి నిటింతియెయై పతివిప్రయోగబా
ధావృతి నందుమంచు నిదెఁ దప్పదు నీవలెఁ బూర్వమందు నెం
తో విలపించినాను పతితో సుఖియింపఁగఁ గోరి కాని నీ
వే వరనిష్ఠఁ బూటినని యెప్పటికప్పుడు దప్పుకొంటచేకా.

ఉ॥ కామశరాగ్నికీలికలఁ గాలెదునాహృదయానుతాప మీ
వేమి యెఱుంగవంచు శపియించితి నన్యథ నాన నాకు భా
గ్యామణి నీవు కమ్మనుచు నైనను నీకు పురాజనుస్స్వప
క్షేమము చేతఁగల్గు సుతసిద్ధియు సాధ్వి పవిత్రశీలమున్ !

ఉ॥ ఈవిషయంబదెట్లు స్ఫురియించెను నీకనివల్కెదేమొ? కాం
తా! విమలప్రభావభవమానసబింబము నీక్ష సేయ ను
ద్భావితమిట్టి ప్రాగ్జననభావన, కావున నీవు ప్రాక్తపో
దైవతమూర్తివారయ సుదారవు నాకిఁక నంతమాత్రమే.

గీ॥ ఈభవంబున మనకిఁక నింతెసౌఖ్య
మైన నీపూర్వతప మగణ్యంబుగాఁగ
దనయసంప్రాప్తిపాత్రము తప్పదిష్టఁ
నేగె నాటికిఁ గొంత సంతృప్తినంత.

చ॥ అనిన విధాన నాసతికి నబ్బురమయ్యెను దర్శనీయకాం
తిని జనియించెబిడ్డఁడు సతీపతులిర్వురు పెద్దపెట్టు నె
మ్మనమున సంతసించిరి క్రమంబుగ నేడవయేట నాశ్రమం
బున నుపనీతుఁజేసి శ్రుతి ముందుగఁ దండ్రి యుపక్రమించినన్

చ॥ చదివెను సాంగమైనశ్రుతి సాధనఁజేసె దదున్నతార్థవం
పదను పురాజనుస్స్ఫురదపారమహాసుకృతానువాసనా
స్పదప్రతిభావిశేషమున శైశవప్రాయమునందె యాదృశా
భ్యుదయ మశేషలోకుల కహో యనిపించె నిఁకేమిచెప్పుదున్

ఉ॥ వేదపురాగ్రహారపురవీధికి మాధుకరాన్నవృత్తి సం
పాదనఁజేయఁబోవఁ గరపంకజలోల సువర్ణకంకణో
త్పాదిత "ఘల్లులా" నినదభాసురదివ్యగళస్వరాప్తి ము
త్తైదువలెల్ల రాఁబిలుతు రాతనిఁజూడ ననేకవారముల్.

ఉ॥ మంగళసంఘసంఘటన మాన్యమనోహరశారదాకృపా
లింగితసత్కటాక్షసఫలీకృతసౌభగదీప్తి వేదవే

దాంగములన్ మహాద్యుతి నధ్యయనంబొనరించి శాస్త్రపా
రంగతుఁడయ్యె నీతఁడపురా యని యొజ్జలు చిత్రమొందఁగన్.

ఉ॥ మోమునఁ గాకపక్షములు మూఁగి ధరోరుమహాబంధురస్థితి
స్థేమములోఁ బ్రకాశిలు నదేవనిముద్దిడ బుద్ధిపుట్టు నా
కోమలదేహమింక జనకోటికిఁ జూచుట కంతెకాని తద్భూమి
సురాన్వయార్భకుఁడు తోఁచుసుమీ యొకదైవమూర్తిగాన్.

ఉ॥ ఆ వరశీలు చక్కఁదన మద్భుతమెన్న సహస్రమన్మథ
శ్రీవరణీయకోమలశరీరవిలాసుఁడు పాత్రవస్సుధా
స్రావము చేత నీ భువిని జన్మముఁ దాల్పఁగ వచ్చినట్టి యే
పావనమూర్తియో యనెడు వైఖరినుండు ముఖాబ్జసంపదన్.

ఉ॥ తాఁకిన మాసిపోవు శతధాపుటపాకవిశుద్ధకాంచన
శ్రీకమనీయమా వపువు చేత స్పృశించినఁ జాలుఁ గారున
స్తోకమణీవిశేషపరిశోభితలోలసువర్ణకుండల
ప్రాకటతాండవప్రోల్లసితబాలకపోలము లాకలార్థికిన్

సీ॥ సకలోపనిషదర్థసంపదాశ్రయము నెల్లఁ
గరతలామలకంబుకరణి నెఱిఁగె
గురువేదభాష్యార్థగోప్యాంశముల నెల్ల
నేకసంధాగ్రాహణేచ్ఛ నరసె
మనుపరాశరముఖ్యమునిరాట్స్మృతుల నెల్ల
శ్రవణమాత్రమున సారమును బడసె
వ్యాసవాల్మీక్యాది వాచారుచుల నెల్ల
పఠనపాఠనపరిపాటిఁ దెలిసె

గీ॥ శారదాపాదపద్మపూజాఫలంబొ
లేక, జనకోపదేశగరిష్ఠబలంబొ
యింతలేఁ బ్రాయమున వాని కింతశక్తి
యెట్టుగలిగెను భగవానుఁడీతఁడేమొ ?

సీ॥ హరనిర్భరానుగ్రహప్రభావంబుచే
మరల జన్మించిన మదనుఁడేమొ
సతులపాతివ్రత్యసరణిభంగము సేయ
నవతరించిన యా జయంతుఁడేమొ
చేతనాచేతనవ్రాతంబులను గూడఁ
జలియింపఁ జేయు వసంతుఁ డేమొ
చారుకళాస్ఫూర్తి సర్వమానవులను
సంతోషపెట్టెడు చంద్రుఁడేమొ

గీ॥ కాక యేదైననొక శాపగరిమ కతనఁ
బుడమి వెలసిన యొకదివ్యపురుషుఁడేమొ
ఏమొ యీతనియవతార మెవనికెఱుక
కొన్నిగుట్టులు వాచామగోచరములు.

గీ॥ అది, విద్యావిలాసాఖ్యనలరెఁగాని
మధ్యను, విలాసుఁడను పేరమఱచిపోయె
పరయు విద్యావిలాసాఖ్యుఁడనుటకన్న
ముద్దుగ విలాసుఁడనుటయె ముదముగొల్పు.

సీ॥ అరుణోదయాత్పూర్వ మఘమర్షణస్నాన
సంధ్యాదికర్మనిష్ఠల నొనర్చి

నొనరించి శారదాభక్తవరోపాసనా
ప్రాప్తిచేఁ గొంతకాలంబు గడపు
గడపి షడ్దర్శనీయమనీషాశేముషీ
సరణిచే సకలశాస్త్రములనరయు
నరసి తత్సిద్ధాంత మవగాహనముగాఁగ
దండ్రితోఁ గొంతవాదంబు జరుపు

గీ॥ జరిపి, మధ్యాహ్నకాల మాసన్నమౌట
భిక్షకింటింటికిని బయల్వెడలు నతఁడు
తన్మనోహరరూపసందర్శనమున
గలఁగు స్త్రైణము చంద్రాప్తి జలధిరీతి.

ఉ॥ తాతకు జబ్బుచేసెనని తత్తరపాటున నిన్న నీగృహా
త్రాంత గమించినాఁడు వరదారను నాకు సహాయముంచి పృ
థ్వీతలదేవచంద్రి యిటు భిక్షము నెవ్వఁడు వెట్టునే బ్రతు
స్నాతకుఁడంచు నొక్క నెఱజాణ వచించును, సస్మితోక్తియై.

ఉ॥ నిన్నను సాంధ్యవేళ నవనీసురభూషణ! గాంగనిర్ఝరీ
సన్నిధి నీవడీవదతిసంకుచితాబ్జము నిట్టివిప్ప లో
నున్న మదాళి మూకముఖోపరిప్రోక్షితంబొనర్చి భి
క్షాన్నము నేరువెట్టుదురయా యని యొక్కతె వక్కె నేర్పుతై.

గీ॥ అనెడు పౌరాంగనోక్తుల నాలకించి
మనసువ్యథఁ జెందఁ దద్భిక్షమాని యాతఁ
డుంఛవృత్తియె నాకెంత యుచితమనుచు
బ్రతుకుచుండఁగ నొక విచిత్రంబు జరిగె.

ఉ॥ శ్రీవిలసన్నియోగికులసింధుసుధాకర! సంస్కృతాంధ్రభా
షావిషయార్థభావనవిశాలకుశాగ్రమనీష! గోస్తనీ
సారసమానసత్కవనరంజితపండిత! చిత్తరత్నసా
ధ్వీవిరహార్తిముక్త భవసౌఖ్యవిభాస్వర! మత్కృతీశ్వరా

ఇది

శ్రీ గుడిమెళ్ళ రామానుజాచార్యప్రణీత

విద్యావిలాస ప్రబంధ

ప్రథమోల్లాసము





శ్రీ హయగ్రీవ స్సహాయః

# విద్యావిలాసము

## ద్వితీయోల్లాసము

క॥ శ్రీతత దేవీపాద
స్ఫీతార్చాచరణభక్తి విలసచ్చేతో
జాతానేకోపాయా!
సీతా రామాంజనేయ! శివగుణగేయా!

ఉ॥ అంత, వసంతకాలము సమాగతమయ్యె నితాంత కాంతలా
తాంత సువాసనాపరిచయాఢ్య దినాంత మరుత్కుమారవి
శ్రాంతినిరంతరంబయి విశాలకిసాలరసాలసాలశా
ఖాంతర లీనకోకిలగళామృతవాఙ్మయభాగ్యవంతమై.

చ॥ అరయ నశోకభూరుహము యావతశింజితనూపురాంఘ్రిసుం
దరహతిదోహదక్రియ వినా స్ఫురణీయపురీతిఁ గొసుమ
స్ఫురణముచేత నిండి జనసుందరమై వెలుగొందుచుండె భా
స్వరమధుమాసలక్ష్మికొక చక్కనియాభరణంబుచాడ్పునన్.

చ॥ అరుణనవీన పల్లవమయంబు రసాలమహీరుహంబు ని
ష్పరిమళ కౌసుమోదయవశంవద మీ నవకర్ణికార మం

చరిత కలస్వనాధ్వనిక కోకిలపక్షికృతాధ్వగప్రియా
భరితము భృంగపీతనవపుష్పరసంబు వసంతమెంతయున్

చ॥ కలిగె నవప్రౌఢ కామినుల కోచకటీరతటోరుకాంకమో
జ్జ్వలమకరీవిచిత్రదళభంగములందు మృదుప్రమోదసం
కలనసుగంధచర్చన సుఖంకరమై గ్రథకంచుకాంబర
ప్రలలితబంధమై వెలుఁగు స్త్రైణము శ్రీమధుమాసవేళలన్.

ఉ॥ ఈమధుకల్పవేళ నుదయించుచునుమా ! సురతాంతతాంతకాం
తామధురాననాంబురుహధారితఘర్మజలోదబిందుసే
వామృదులయానసంకలితబాలసరోజమరందశైత్యసు
స్థేమ సమీరపోతములు సేవితదారుధూపధంబులై.

సీ॥ గున్నమామిడికొమ్మ గుబురులో ప్రేలాడు
పచ్చికాయలగుత్తి పొందిమంబు
అల్లిబిల్లిగ నల్లు మల్లెవల్లికలలోఁ
గళలీను పూలమొగ్గల వసంబు
పారిజాతశోభలోఁ బసుపుకాంతులగుల్కు
వేపకొమ్మల పూత వింతసొగసు
చెన్నంగి కొబ్బరిచెట్టు మొవ్వాలలోని
లంకెలైదూలు బొళ్ళాలఠీవి

గీ॥ గుబగుబలు గొల్పు పొన్నల గొప్పతావి
కెంపు వర్ణాల రాజిల్లు కింశుకాలు
గెలలు వేసిన తాటితోపులును సైత
మదిగో! వచ్చెను మధుమాసమనుచుఁ దెలిపె.

చ॥ కలధనమంత బీదలకుగా వినియోగముసేసి పట్టిచే
తుల నిలుచున్న కీర్తిగల దొడ్డవదాన్యులరీతి సండె లో
కులకుఁ బునర్మదాశలను గొల్పుచు బాదపుఁజెట్లు పండుటా
కుల నిలకెంత యెత్తు తన కొమ్మలనెల్ల విదల్చి రాల్చుచున్.

సీ॥ మంచి నిద్దురలోన మరల లోనికిఁబోవ
విసిగి ప్రియుసి యింటవేసె సెజ్జ
చెరఁగుమాసినగూడఁ దరుణి భర్తను స్మిత
ప్రౌఢవీక్షాశ్లేషరతుల ముంచె
తొలిరేయి సిగ్గుతోఁ దొలఁగి రెండవనాఁడు
కొంచె మందకఁజేరెఁ గొత్తభార్య
ప్రణయలీలాకోపభరపరాఙ్ముఖకాంత
నిండురాతిరి నాథు నిద్రలేప

గీ॥ రేపు లగ్నంబునకుఁ దూఁగ లేమటంచుఁ
దిరుగమాటాడు తల్లికిఁ దెలిపె నార్తి
ప్రియుపుకమారి దీర్ఘనిశ్వాసకలన
ధీర! వాసంతఋతువు నే మనఁగవచ్చు.

కం॥ పైకము లేదని కుందెడు
లోకాళికిఁ గొంచెమంత లోటను మాటే
లేక యొసంగెను దృప్తిగ
పైకము వనలక్ష్మి కరుణ వనితకె చెల్లున్

గీ॥ మిత్రుఁడైయుండి కొన్నాళ్ళు మేలుసేసి
మండిపడుచుండె నేటికిచంద్రుఁడకట

నూరుఁడటవైన నిది యేమి చోద్యమయ్య ?
కనుక నే యుత్తరావకుఁ గదలవలసె.

గీ॥ అతనుశాస్త్రము ద్విజులౌట నభ్యసించి
శ్రుతులకనుకూలమైన వాక్తతులతోడఁ
జైత్రసన్నిధిఁ బికములు సదువదొడఁగె
వచ్చుపాఠము చిలుక లందిచ్చుచుండ.

గీ॥ చైత్రనిర్భరసంశ్లేషసౌఖ్యగరిమఁ
గులుకువనలక్ష్మిమెయి మీఁది పులకలనఁగ
నలరుమొగ్గల నలికులమాశ్రయించెఁ
గన్యకలడాయు భుజగులకరణినపుడు.

సీ॥ నవనవశ్రీలతో నటనసల్పుచుఁ గోర్కు-
లూరఁజేసెడు తోఁటకూరమళ్లు
మృదులతాసముదయోన్మేషాప్తి ధరఁబ్రాఁకు
కళలీనుమాగాలి యులవచేలు
చెలమ కేతానెత్తి చేదివ్రాసెడునీట
వరిల్లుతోలికోఁత వంగతోఁట
ఒకతీఁగ నొకతీఁగ నొరసిపైకెక్కుచు
గోరుపిందెలనున్న బీరపాదు

గీ॥ అరుణుఁడిఁక గంటకేతెంచుననెడు వేళఁ
గులుకు లేగాలిహాయికిఁ దలలనూపు
నట్టియానంద మేఋతువందు గలదు
చైత్రమా ! నీకిదే నమస్కారశతము.

ఉ॥ ఆ ఋతువందునొక్క దినసాంతప్రవేశ గభస్తిమాలిజీ
ర్ణారుణకాంతిబింబ మపరాంబుధిలోఁబడి మున్గుచుండఁ దాఁ
జేరె విలాసుఁడొంటరిగ శ్రీయుతదాక్షిణమందమారుత
స్ఫారనికుంజపుంజమధుసౌరభవాసితగాంగతీరమున్.

ఉ॥ ఆయెడ సాంధ్యకృత్యముల నన్నియుఁదీర్చి ముహూర్తమాత్రమం
దే యొకతిన్నెమీఁదఁ గుసుమేషునికై వడిఁగూరుచుండె గాం
గేయపయఃకణాప్తిపులకీకృతశీతలమందమారుత
స్ఫాయదఖండసౌరభవశంవదలోలతరాలకాస్యుఁడై.

ఉ॥ ఆసమయంబునందు నవయౌవనశైశవసంధిమన్న క్షో
ణీసురబాల యొర్తు రమణీయతరాంఘ్రిసరోజయుగ్మవి
న్యాసవిలాసకౌశల రణన్మణినూపురఝుల్ఝులస్వనో
ల్లాసితచిత్తయై స్మితకళల్ నవకౌముది లీనుచుండఁగన్.

చ॥ ఫరిదనిలాంకురాకలిత జాదు లలాటమునందు మూఁగు ముం
గురులను మాటిమాటి కతికోమలకానకకంకణక్వణ
స్ఫురితకరంబుతోఁ బయికిఁబోవఁగనొత్తుచు భీతబాలశం
బరసతిమాడ్కి లౌల్యమున భాసిలు దృష్టులఁ బాఱఁజూచుచున్.

చ॥ పిఱుఁదులఁ దాకి కుల్కు నవవేణివయిన్ బరిఫుల్లమల్లికా
పరిమళముల్లసిల్లఁ గనువారికి శ్రీమధుమాసలక్ష్మినాఁ
బరఁగుచుఁ గర్ణశష్కులుల భాసిలు కాంచనరత్నకుండల
స్ఫురితమనోజ్ఞకాంతులు కపోలతలంబులఁ దాండవింపఁగన్.

ఉ॥ శ్రీకరకంధరాహృదయసీమల హేమమణీవికారమా
లాకమనీయకాంతుల విలాసము చేఁ గడుఁగుల్కుచుండఁ బ్రా

భాతికభానసంస్తవవిభాస్వరముగ్ధమృణాళనాళశో
భాకలితోపమానమృదుబాహుయుగంబు సిరుల్ సెలంగఁగన్

చ॥ లలితనితంబదేశము ఘులంఘులదుజ్జ్వలరత్నకింకిణీ
వలయితసూత్ర సంగతిని భాసిలుచుండఁ బదద్వయీనఖకాం
తులు స్థలశోణపద్మరుచిఁ దోఁపఁగఁజేయ దుకూలవస్త్రసం
చలదఖిలాంగదీప్తియయి జంగమహైమలతావిధంబునన్.

చ॥ కులుకుచు వచ్చి గాంగఝరకూలమునందు మనోజ్ఞసైకత
స్థలమునఁ గూరుచున్న సుమసాయకతుల్యతనూవిలాసుఁ జం
చలయమునానదీలహరిసాంద్రవినీలనిరంతరప్రభా
లలితకటాక్షవీక్షణవిలాసముతోడ విలాసు సేర్పునన్

ఉ॥ చూచి తదీయసుందరతఁ జోద్యము నంది ముహూర్తమాత్రమా
రేచితభ్రూవిలాసవిరళీకృతచారుకటాక్షమాలికా
సూచితసౌహృదోదయవిశోభితయై పులకాంకురశ్రమ
ప్రాచురిదీప్రముగ్ధతనువల్లికయై ప్రనివృత్తదృష్టియై

ఉ॥ స్నానము సేయఁగా వలయు జహ్నుసుతాఝుకతీరదేశసో
పానపరంపరాధ్వనితపాదసరోరుహరత్ననూపుర
ధ్వానవిలాసయై కడకుఁ దత్పథమున్ విడనాడి సేరె సు
శ్రీనిధి రేవులోనఁ గలశీవరశోభితకక్షభాగయై

ఉ॥ ఆకమనీయరూపుఁడు తదద్భుతముగ్ధకటాక్షమాలికా
శ్రీకలనావిశేషవివశీకృతభావనుఁడై క్షణంబు మో
హాకులుఁడై తపించె నహహా యెటువంటి మహాత్ముఁడైనఁ గాం
తాకనకాభిలాషమయధామనిబంధితచిత్తుఁడౌ గదా !

ఉ॥ అంతటఁ జంద్రికస్వకలాప్తికి నాజలరాశివ్రాతన
త్యంతము తన్మనంబు బహుధాక్షుభితంబుగ నుండెఁ బైన సా
యంతన కాల మందు నవయౌవన మాధవునంటివేళ నా
సంతవినోదయాంబును రసజ్ఞత, చక్కని కన్య, దాపులో
నెంతటివారికైన చలియింపదొకో? మన మట్టివేళలన్

ఉ॥ అందెలమ్రోతచేత నొకహంస ప్రియాగళనాదమంచు నా
నందమునంది శీఘ్రగమనంబునఁ దుంగతరంగమాలికా
బృందమునుండి స్వానసురభీకృతభూసురకన్యవెంటనం
టిం దడవుట్టి నప్పుడచటన్ దిటగాఁడె నిభీతచిత్తుఁడై.

ఉ॥ అనదయాడునప్డు, చరణాబ్జమునందు మజెంత నూపుర
ధ్వానము పిక్కటిల్లి నిజదారగళస్వరమంచు భ్రాంతితో
నూపి మరాళ మామెను మహోద్గమనంబున నెంబడింప సో
పానశిలాధిరూఢయయి వ్రిస్థలి జారెడిలీలనేడ్చి వి
గా నవతంతు చాలనఘునాఘునదుజ్జ్వలగానవైఖరిన్.

ఉ॥ ఆసదితంబు కర్ణకుహరాంతరసీమ లగింప వెంటనే
వేర విలాసుఁడచ్చటికి శీఘ్రగతిక్రమపిష్టవత్పదాం
భోరుహయుగ్మఁడై హృదయపూరితవిస్మయుఁడై నితాంతవి
స్ఫారితనేత్రుఁడై, వరభుజాతటికాపతను త్కరియుఁడై.

ఉ॥ చేరి భయంబులేదనుచు శ్రీధరణీసురకన్యనంత సాం
పారఁగ శాంతిఁగొల్పి పరిహాసవిశోభితకోమలాధర
శ్రీరమణీయుఁడై, దరికిఁ జేరిన హంసను స్వీయపాణి నం
కేరుహ మల్లనాని పులకీకృతమానసుఁడై, గ్రహించినన్.

ఉ॥ ఆకలహంస, వాని కరమందుఁ నొకింతయు భీతి లేక చం
చూకటుకోటిలగ్నమృదునూత్నతరార్ద్రమృణాళఖండశో
భాకమనీయమై, చలితపక్షయుగాంతరలీనగాంగవా
శ్శీకరమై వసింప వికచీకృతదృష్టి విలాసుఁడంతటన్.

ఉ॥ ఆమెనుజూడ, నామెయును, జలార్ద్రమనోజ్ఞదుకూలధారణ
స్థేమమనోహరాంగియయి, శ్రీ విలసిల్ల దదీయచిత్రచే
ష్టామహనీయదర్శనవిశాలవిలోచనపంకజన్మని
స్సీమకటాక్షవీక్షణవిశేషముచేఁ దిలకించె నాతనిన్.

ఉ॥ అంతట వారలిద్దరు మహాప్రణయార్ద్రకటాక్షమాలికా
సంతతిపాశబంధనవశంవదమానసులై, వసంతసా
మంతనమందమారుతవిహారవశీకృతగాంగకుంజలా
తాంతపరీమళాప్తిజనితస్మృతులై త్రపనొందుచుండఁగన్.

ఉ॥ ఆ కుసుమేషుమూర్తి కరమందున నున్న మరాళమప్డు చం
చూకమనీయకోటిపుటచూర్ణితఖండసరోజినీమృణా
ళీకలనావిశేషశిశిరీకృతకోమలకంఠ మెత్తి సు
శ్రీకరవాక్యతోఁ బలుకరింపఁగసాగె విచిత్రధోరణిన్.

శా॥ బాలా! భీతినిఁ జెందఁబోకు మిఁకనీపాదారవిందోత్థవా
చాలశ్రీమణినూపురద్వితయభూషానాదఝాంఝుళీ
లీలావైఖరికిన్ భ్రమంబడితి నారీతిన్ శ్రమాంభఃకణా
వ్యాలోలాలకఫాల! తప్పుక్షమియింపంజాలు నంచత్కృపన్

ఉ॥ నేనిటువల్కుచున్న ధరణీసురవంశసుధాబ్ధికల్పవ
ల్లీ! నయనాంబుజాతముల నింతలు సేయుచు విస్మయవిభ్రా

ధీనవిలాసదృష్టుల నదేవిధిఁ జూచెద వేటికమ్మ లో
కానకు సృష్టియౌ కమలగర్భవివాహన మిద్దియే సుమీ!

ఉ॥ నేనిపుడారకుంట నవనీసురపుత్రి! పవిత్రమైన గం
గానది నీదులాడ నిటుగాఁ జనుదెంచితి నేఁడు సత్యలో
కాన సరస్వతీజలజగర్భులు లేరుసుమీ! వరస్వరా
నూనకఠోరశాపములనొంది వసించుచునుండి రీయెడన్

ఉ॥ కారణమేమనంగ నొకకాలములోనఁ బ్రసంగమందు వా
ణీరమణీశిరోమణికి నీరజగర్భున కుద్భవిల్లె దు
ర్వారమహాశ్రుతిస్మృతిపురాణప్రమాణనిదానవాక్యవి
స్ఫారితయుక్తికల్పనల బ్రహ్మముగూర్చి మిథోవివాదముల్

ఉ॥ వైదుషిచూడ నిర్వర కసార మమేయ మగణ్యమౌటఁ ద
ద్వాదసభాటిలోఁ బరిభవంబు ఘటిల్లకపోయె నరి కే
తాదృశదంపతిశ్రుతిపదంబుల కన్వయ మొక్కఁడైన, నేఁ
గాదన లేకపోయెను, జగత్త్రితయంబున నెందు నుండినన్.

ఉ॥ ఎంతకు నాదువాదనకు నింతి యొడంబడదంచు ధాత దు
ర్దాంతరుషాప్తి నొక్కసమయంబున వాణికి శాపమిచ్చె, నో
కాంత! ధవాజ్ఞ దాఁటితివి గాన నిఁకెన్నఁడుఁ గూడ నిట్టిరా
ద్ధాంతము సేయకుండ దృషదాకృతి నొందుమటన్న నామెయున్.

మ॥ అకటా! యెంతటి శాపమిచ్చితివి; నాథా! నాల్గువేదాలఁ బూ
నికతోఁ జూచిన మేటివి యనుచు నే నీతో వివాదింప ను
త్సుకతన్ జెందితిఁగాని లేదెద జిగీషోత్సాహసంరంభ మిం
తకు యుష్మత్పదమంటుచుంటిఁ గృపరాదా తప్పు మన్నింపవా!

ఉ॥ మానసపద్మమందు నిను మానితభక్తి సమర్చనంబు ని
ధ్యానము సేయు భక్తతతి కర్థము లిచ్చెదవంట నే వినో
దానకు బ్రహ్మవాదన విధంబును జూపఁగ నింతలోనఁ బా
షాణతనుత్వమందుమని శాపమొసంగుట ధర్మమే ప్రభూ!

సీ॥ సంగీతసాహితీసారస్యముల నింక
నేసాధ్వి నీకు విన్పించునయ్యా
సకలప్రజాసృష్టి జరుపుచుండెడివేళ
నొసటివ్రాతలేవతి యొసఁగునయ్యా
సృష్టిక్రమము వ్రాయు శ్రీగాంగకనకార
విందాళి నేజూచి వినయునయ్యా
పరమభక్తులఁబ్రోవ వరమీయ నీకోడ
హంసపై యేకాంత యరుగునయ్యా

గీ॥ అక్కటా! ముందువెనుకల నరయలేక
పెద్దబండగ నన్ను శపింపఁదగునె?
ఏ నొనర్చిన యపచారమేమి? బ్రహ్మ
మడఁకటయాఁగూడ నింతతప్పగునె! నాథ!

చ॥ నిమిషము మద్వియోగమును నీవు భరింపఁగలేనివాఁడ వే
క్రమమున నన్ను నిట్లు పడిగా శపియించితి దుశ్శిలాస్వరూ
పమునఁ జెలంగు మంచు నిఁక బ్రహ్మవిచారణబోలికేగ దో
షమునఁ క్షమించి శాపమును జయ్యనఁ ద్రిప్పుము నాథ మ్రొక్కెదన్.

ఉ॥ శాపమొసంగి త్రిప్పుటకు శక్తి సెలంగును మాకు నీ శిలా
రూపము నాకు మాన్పుము వియోగము జేయుదు చేసితేని నా

ఖా! పతిలేని జీవనము దారకవ్యర్థముగాన నీవు నా
దాపుననే వసింప వలె దప్పదనన్; సతి! యింతనాగు మీ

ఉ॥ శాపముదిప్పుడెట్లని విచారణ సేయుచు నుండ నింతలో
నే, పడిపోయినట్టు శపియించితివయ్యయో! మూర్ఖురాల!నా
కాఁపుర మెప్డు సౌఖ్యమునఁగచ్చికలయ్యెను జాలునింక వి
ద్యాపరమూర్తియైన కులదారసుఖంబులు నాకునేఁటితోఁ గా.

ఉ॥ నాలుగు వేదముల్ సదువనా! మతిసృష్టియె సేయనా! తపో
లీలఁగ్రహింపనా! వరములిచ్చుట కేగుదునా త్వదీయ నా
దాళికి, వాదులాడనగునా? కలహంబులఁదెచ్చుపుత్త్రిక
యాత్రలను మానెదనా, చివరకయ్యయొ నీవిపుడిచ్చు శాపనా
క్యాలకుఁబుట్టువందుచు జగాప్తికిఁగుంగుదునా వచింపుమా.

సీ॥ ఆగమంబుల నెల్ల హరియించి యేడ్పించెఁ
గుటిలాసురుం డొక కొన్నినాళ్లు
ఈప్సితార్థములిచ్చి యేగుమీ పనిచెప్పఁ
బైఁ దన్నవచ్చె రావణాసురుండు
నిజము కల్లగఁజేసి నేనాడి నానని
వడఁదిట్టె నాకాలభైరవుండు
కంటికే నొకమాఱు కనుపింపలేదని
సృష్టికే మొదలెత్తె సృప మహర్షి
గీ॥ ఈశ్వరుని చేతఁ దలను కోయించుకొంటి
గడసుఁ గులకాంత శాపంబు నిడుటఁగంటి
పనికి మాలిన బ్రహ్మాధిపత్యమందు
నాదినుండియుఁ గష్టాల నందుటయ్యె

సీ॥ ఉద్యోగమా! క్షణ మూరకుండఁగలేని
నిరతలోకప్రజా నికరసృష్టి
భాగ్యమా! నాకన్న బహుళవిద్యాతత్త్వ
భావంబెఱింగిన ప్రౌఢురాలు
హా హా నంబా! యెద్ద భాగ్యవతులయందు
సాధ్యమొనరించు సాహసుండు
పుత్రుండా! కలహామే ముప్పూటతిండిగాఁ
బరికించు పడియుళ్ల పావరాజు

గీ॥ గృహము! శ్రీవిష్ణునేత్రద్వయీకవీశు
నీపదున్మోషముకీలన దూషితంబు
కనుక నీవంటివారితోఁ గాఁపురంబు
సేఁతకన్నను నీనాడి సేయు టొప్పు.

గీ॥ అదియునుంగాక యొకవిషయంబు నీవు
శాపసంలబ్ధ గురుకులాశ్రమమునందు
రాయి వలెనుండి, కొన్నాళ్లు బ్రహ్మవాద
తత్త్వమెఱుఁగుదు పవసాన దశ లతాంగి.

ఉ॥ నీవాటనుండు వంచుఁడరుణీ! పఠియించెదవేమొ? తొల్లి ల
క్ష్మీవిభుఁడంచుఁబైనడియొ చెప్పఁగఁబోవుచు నంతలోన గం
గా విమలప్రవాహమున "ఘల్లున" దూకి మరాళమంతఁబై
పై పడితేచిపోయె నెవరా యని వారలు దృష్టిఁద్రిప్పినన్.

చ॥ ఝుణఝుణలాడునందెలను జప్పుడుసేయుచు వచ్చునొక్క సా
ధ్వినిగని యావిలాసుఁ డతిదీనపుదృష్టులఁజూడ నామె త

స్త్రనముగ్రహించి వెంటనె ఘనంబగు పూఁబొదరింటిలోనదాఁ
గెను, విషయాభిలాషపులకీకృతచిత్తుల బాధలివ్విధమే.

వ: వడివడి మెట్లనుండి దిగు భామిని క్రిందికివచ్చి రేవులో
దడదడలాడుచిత్తమున స్థైర్యము నెట్టులొ పూని సంధ్యవా
ర్చెదు మిషనున్నవాని వికచీకృతదృష్టులఁజూచుచుం గనం
బడెనె మహాత్మ! యీడనొక బ్రాహ్మణబాలయటన్న నాతఁడున్.

గీ: ఏవిచూచునా ? యనిచెప్ప వేదిసుడువు
వద్ది చూడవుగాదె? సాధ్వి ! యనంగ
నతని పరిభాషలోఁ దత్త్వ మరయలేక
క్షణము కదలక యట్టె నిశ్చలతనుండి.

ఉ: ఆయతనేత్ర యాగ్రమున నస్త్రులురాల్చుచు సాంధ్యవేళ నా
దేయజలంబుఁగైకొన నదీయతటమ్మునకువచ్చి చాలసే
పాయెను రాకయుండుటను స్వగేహంబుగ వచ్చితి నీడకిప్పు డ
య్యయ్య! యిట లేకపోయెనుగదా యిఁక నాగతియేమిచెప్పుమా!

ఉ: నేనొకనాఁడు సాయమునవనీసురభూషణ ! చింతపన్న గం
గానదిలోన నీరమును గైకొనిపోవఁగవచ్చి రేవులో
స్నానముఁజేసి నీటఁ గలశంబును ముంచుచునుండ నంత దూ
రాన నొకండు దుఃఖమునరాఁ గనుగొంటిని జంటిబిడ్డతోఁ

ఉ: ఆతఁడు మెల్లమెల్ల నటు లాగతుఁడై యొకమూల గాంగవీ
చీతతిలోన, బిడ్డను త్యజింపఁగ దిక్కులు చూచుచుండ నే
నాతఁడె నయ్యయో విడువ మాకుమటంచును జేరఁబోయి నీ
చేతుల కాలిపో నెటులఁజేసెద వింతటిదారుణక్రియన్.

ఉ॥ ఆకృతిఁజూడఁగా నొకధరామరుపోలికనున్నవాఁడవె
ట్లీ కలుషానుభూతి మొలకెత్తెను నీ హృదయంబులోన నొ
రా! కఠినస్వభావమున నాలను గోయు కసాయివాఁడు మే
లై కనుపట్టుచుండెనుగదా! ధర నింతటి పాపులుందురే?

ఉ॥ ఈవగిదిన్ దురంతమగు కృత్యము సేయుచొకవ్వుడైన, సం
తాపము లేని మిమ్ములను ధారుణి మోయునుగాని పాపమీ
పావను దా భరించునె? కృపారహితాత్మక! యంచు వీఁక నే
నావసిపావనందుకొన హస్తయుగంబును సాఁచి తెమ్మనన్.

ఉ॥ ఆ సమయాన నాతఁడు దృగంతరవిస్ఫురితవారితోడ ని
శ్శ్వాసభరంబుతోడ, గళసంచలదక్షరసంధితోడ సా
ధ్వీ! సహజస్వభావమును నెవ్వఁడు మాన్పఁగ శక్తుఁడౌ మహా
భూసురవంశమందు నిఁకబుట్టినమాత్రన నీచుఁడుండఁడే?

ఉ॥ పుట్టుటకేను బుట్టితిని భూసురజాతిని, నాల్గువేదము
లట్టిగ వల్లెవేసితిని కంఠగతాలుగఁ గొంతకాల మె
ట్టెట్టొ గతించెఁగాని కడకేర్పడె నాకొక పాపదూఱు చే
పట్టెను బుత్త్రిసీతఁడని పాపినిజూడక మోహవశ్యుఁడై.

ఉ॥ ఔను నిజంబ యీవిషయమంతయు లోకము నోరుమూయ నె
వ్వానికి శక్యమౌను గతత్రపుఁడనయ్యు దురంతమైన మో
హానల లక్ష్యమైతినిగదా యిఁక నేటిపవిత్రత నాకుఁ ద
ల్లీ! నిజమున్న నమ్ముదువొ లేదొ దివానిశ తీవిషాదమే.

ఉ॥ చేసినదోషమంతయు వచించితిఁ దీనికటుందుగాన నా
దోసము చెప్పనంటిఁ గృపతోఁ దిలకింపుము తల్లి! నన్ను వి

ద్యాసరసాత్మయుంచు నవయౌవనయుంచు వరాఢ్యయుంచుఁ దే
రౌనగణించి మోహమున నయ్యెరియొ చెప్పఁగఁజాల నోటితోన్

ఉ॥ ఎక్కడిపుత్రి నీకనుచు నెంచెదవేమి? వచింతునమ్మ! నే
నొక్కదినాన నాల్గుశ్రుతు లూఁకనేర్చిన లాభమేమి? పెం
పెక్కిన మంత్రశక్తి ఫలియించునొ? లేదొ! యటంచుఁ జూడగా
గ్రక్కున నొక్కచక్కనగు కాంత కనంబడె నాదు ముందటన్

ఉ॥ ఆ యువతీస్వరూపమున కచ్చెరువంది ముహూర్తమాత్ర మహా
రా! యని మెచ్చి ప్రేయసిగ నజ్ఞుఁడనై వరియించినాఁడ న
మ్మా! యిఁక నేమిచెప్పఁగల నాజపమూ తపమూ ప్రతిష్ఠ లే
మాయెనొ కూఁతుతోడ సరియైనలతాంగిని గూడితిన్ గదా.

చ॥ గతజలసేతుబంధమునఁ గాఁగలదేమి? దివానిశంబు నా
సతి శ్రుతిసాహితీగరిమ చాలినచోట వివాదమాడు ధీ
మతిక్షణముల్ యుగంబులుగ మానక కాఁపురమీడ్చుచుంటి నా
గతి యిటులయ్యె నిప్పటికిఁ గల నావ్యథఁ జెప్ప శక్యమే.

ఉ॥ జౌవనఁ గాదటంచుఁ బ్రతిపూఁటను మాటికి మావివాద నె
వ్వానిని దీర్పఁజెప్పఁ బదపద్మములంబడి వేఁడుకొందు నా
జాణకు నాకుఁ గాఁపురము సాలిఁకనన్న విరక్తిఁ జెంది యొం
డైన సుఖాన నుందమని దారనువీడి చరింపనెంచితిన్.

ఉ॥ కూఁతుఁగ నెన్నఁగాఁదగిన కోమలిఁగూడిన పెద్దతప్పు నా
చేతమునం దహర్నిశము చిచ్చువిధాన జ్వలించుచుండ నా
పాతకమెల్లఁ బాపుకొనఁ బావనగాంగతటంబునందు సా
ధ్వీ! తపమూన చక్కని ప్రదేశముఁ జూచుచుండ నొక్కతోన్

ఉ॥ ఉల్లముఝల్లలింపఁ గుసుమోత్కరసౌరభముల్లసిల్ల ను
త్ఫుల్లసరోజపత్త్రముల పొత్తిట నల్లన నల్లిబిల్లిగా
నల్లిన మల్లెమొల్లలలతాంతరసీమఁ బరుండియున్న యీ
పిల్లను, మెల్ల మెల్లఁ గని విస్మయదృష్టులఁ జేతనెత్తితిన్

ఉ॥ ఆవసిపావరూపమున కావఁగరాని ముదంబుఁజెంది యు
శ్లే పరికించుచుండ స్మృతికెక్కె హఠాత్తుగ నావురామహా
పాపము దానిఁ బాపఁగఁ దపంబొనరింపఁగవచ్చియుంట న
మ్మా! పరితప్తమానసుఁడనై క్షణముంటిని నిశ్చలక్రియన్

ఉ॥ ఆపఁగరాని దుఃఖమున నశ్రులురాల్చుచు దిక్కులేని యీ
పాప నిఁకేమిసేయుగ నుపాయముదోఁపక చూచుచుండ ని
క్షేపమువంటిభార్యను ద్యజించినదోసము లేదుకాని పా
పీ! పెఱబిడ్డవీడఁదడవేటికొ యింతటిమోహమేటికో!

ఉ॥ పావమురూపుమాపఁగఁ దపంబును సేయగవచ్చి వెండి బా
లాపరిలాలనాస్పదవిలాసములఁబడి తేల మూర్ఖ! నీ
చాపలవృత్తికిప్పటికె సర్వజగం బెద రోయుచున్న దీ
పాపను బాఱవేయ నపవాదము మోయుట కష్టమంచు నా
లోపల నెవ్వరో యొకరు లోలవిలోచన! బోధఁజేసినన్

ఉ॥ కాదన లేక గాంగఝరగర్భములోఁ బడవేయనుంటి నీ
మాదిరి బిడ్డ నేఁ బనికిమాలినవాఁడ క్షమింపు తల్లి! యీ
"బాదరబంది" నాకిఁకను వద్దనిపించెను దుర్నివారపా
పోదయమానటంచెఱిగియున్ శిశుహత్యను చేయఁబూనితిన్.

ఉ॥ పెంచఁగ నెవ్వరుండిరిఁకఁ బ్రేయసి నింతకుఁబూర్వమెన్నఁడో
పించితి నన్యులేరు కనుపింపరు పాపము దీనివారి క

ర్పించెదమన్న నొక్కఁడ భరించెదనన్న జనాపవాద మె
ట్లించుఁదలంచి గాంగఝరి కర్పణసేయఁగవచ్చితిన్ సతీ!

ఉ॥ నాలుగువేదముల్ సదివినాఁడనుమాటయె కాని తల్లి! పా
పాలకు భైరవుండనిఁక భార్యనుబిడ్డను వీడినట్టి దు
శ్శీలుఁడ బ్రాహ్మణుండనని చెప్పుటకైన నర్హుఁడన్ క్షమా
లీలనుబ్రోవు మీ శిశువు మృత్యువుదప్పెను నేఁడు నీకృపన్.

మ॥ ఇదిగో, నైకొనుమీకుమారి జనయిత్రీ! నేను ధన్యుండ న
య్యెద, నాచిత్తము శాంతినొందు నిఁక నే నెందో తపస్సిద్ధిచే
విదళింతుం గలుషాళి నంచు నతఁ డర్పింపంగఁ జేసాఁచి స
మ్మద మేపారఁగఁ దీసికొంటిసుతనో! భూమీసురగ్రామణీ!

గీ॥ ఇంతదానిని నంతగా నెట్లొ పెంచి
పెండ్లిసేయంగ నొకవరు వెదకుచుండఁ
గంటగాన్పించె నీమె మాంగల్యకంఠ
చరణనిక్షిప్తనూపురాభరణయగుచు,

ఉ॥ ఆయెడ నేను విస్మయమయంబగుదృష్టిని బాఱఁజూచి యు
మ్మా యెటువచ్చె నందెలును మంగళసూత్రము చెప్పుమన్న న
య్యా! యెవఁడో! విలాసుఁడట యాశ్రమందతఁ డుండునంట వి
ద్యాయుతనంబు వాని రసనాంచల మాతని నీ వెఱుంగవే?

ఉ॥ ఆతని బెండ్లియాడుమని యాశ్రమవాసిని, వాణి, నిద్రలో
రాతిరివేళఁగన్పడి విలాసునిఁదక్క తదన్యనెవ్వరిన్
మాతరొ కోరవద్దనుచు మంగళసూత్రము నూపురంబు తే
ష్టో తగిలించిపోయెనని పుత్రివచించె మహాత్మ వింటివే?

చ॥ అని మఱియేమొ చెప్పుతఱి నంత విలాసుఁడు గాఢవిస్మయం
బునఁ బరికించుచున్ భవతి! పోయెద నింక గురుండు కోపగిం
చును దడవైన దేలయని చూడుము దిక్కుల నెంతప్రొద్దు ప్రా
యెనొ యని మెల్లమెల్లబయి కెక్కఁగమించుచునుండ నామెయున్

ఉ॥ చీఁకటినొంటిఁగా నను ద్యజించి గమించుట న్యాయమౌనె నీ
కో కమనీయశీల! క్షణముండుము పుత్రిక లేని జీవనం
బేకరణిన్ భరింపఁగల నేనని పల్కుచుఁ బోయి జాహ్నవీ
భీకరవారిలో దుముక వీక్షణసేయుచునుండ నాతఁడున్

ఉ॥ ఇంతటిసాహసంబు భవతీ! తగునే యని పల్కుచుండ లా
తాంతనికుంజపుంజములదాఁగిన పుత్రికపైకి వచ్చి పె
న్వంతన మాత్మఁ గోనఁగ జయ్యనఁ దల్లిని డాయఁబోయి దా
గొంతుకఁ గౌఁగిలించుకొనెఁ గూర్మికి లక్షణ మిద్దియే కదా!

ఉ॥ అప్పటికప్పుడే యుదయమయ్యెను దూర్పునఁ జంద్రమండలం
బెప్పటివోలె చంద్రికయు నల్లడఁ గ్రమ్మెను చల్లగాలి గం
గాప్పులఁ దేలియాడి నడయాడుచునుండెను గుంజసీమలో
గప్పున పుష్పగుచ్ఛముల కమ్మనితావియువచ్చె నంతలోన్.

గీ॥ తార చెక్కిలిగిలివెట్టఁ గైరవాపుఁ
డల్ల పకపకనవ్వఁగా నుల్లసిల్లు
విమలరదనాంకురప్రభావిసరమనఁగ
నొప్పె పాండురనవచంద్రికోదయంబు.

గీ॥ గగనశయ్యను దారయుఁ గమలవైరి
పండుకొనుటకు పోయిగానుండుననుచు

విరియఁజిమ్మిన మల్లెలవిధముదోఁచె
లెక్కకును బెక్కులౌ చుక్కలొక్కరీతి.

ఉ॥ ఆరమణీయసంఘటన కంతువిలాసుఁడు వింతనొంది తా
జేరెను మెల్లమెల్ల గృహసీమకు నామెయుఁ బుత్రిరాక కెం
తో రుచిరాస్యయౌచు సుతతోఁ దనత్రోవను దానుబోయె న
వ్వారట నింక నేనొకఁడఁ బ్రక్కను పావనియైన గంగయున్.

గీ॥ కలము వ్రాయదు పయినేమి కతమటంచు
భావపుసమాధివీడ నాశ్వాసమయ్యె
ధవళరుచివస్త్రయై గంగ ధవునికడకు
వడిగమాత్రము చాంద్రిలో నడుచుచుండె.

ఉ॥ శ్రీమదుమాపదాంబురుహసేవనలంభితనైగమాంత వి
ద్యామధురానుభూతికలితాత్మవిచార! కవీంద్రసన్నుతో
ద్దామయశోవిహార! స్మితతుందిలముగ్ధతరోక్తిసార! నా
నామహనీయకావ్యరచనావిధిభాస్వర! మత్కృతీశ్వరా.

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్య ప్రణీత
విద్యావిలాస ప్రబంధ
ద్వితీయోల్లాసము





శ్రీ హయగ్రీవ స్సహాయః

# విద్యావిలాసము

## తృతీయోల్లాసము

క॥ ఏతత్కావ్యకుమారి
ప్రీతిప్రాశస్త్యగుణపరిచయకలనా
జాతానందశుభాశయ!
సీతారామాంజనేయ! చిహ్నసుగేయా!

క॥ అంత విలాసుఁడు, గతసా
యంతనమున జరిగినట్టి యబలాగాథన్
జింతనసంతతిదంతురి
తాంతఃకరణప్రవృత్తి నరయుచునుండన్,

సీ॥ చరమాచలనితంబపరిలంబివిధుబింబ
జీర్ణచాంద్రీపాండువర్ణకలన
గంగాతరంగిణీకమలినీకమనీయ
వాసనాశైత్యవైభవమున

ప్రాభాతికానిలక్రమరణద్భారతీ
చారువీణాగానసౌరభమున
నిఖిలద్రుకోటరనీడనిరతపక్షి
కులప్రడీనోడ్డీనకలకలమున

గీ॥ విప్రవరీయసీస్తోత్రవివిధభణితి
సూరిజనగీతలసదుపసూక్తినియతి
ప్రౌఢకాంతాప్రణయకోపభారవిరతి
వేగుజామయ్యెనని కనుపించెనంత.

ఉ॥ ఆరనిభక్తి శ్రీగురుకులాశ్రమమందు సరస్వతీగృహ
ద్వారబహిర్వితర్దికల బాలురుతీర్చి వసించి మేఘగం
భీరగళస్వరప్రగతి వేదము లెల్లఁగలాభిలాషు లు
చ్చారణసేయుచుండిరి నిశాపరిణామమనోజ్ఞసంధ్యలోన్.

ఉ॥ ఆగురుదేవపుత్రుఁడు నిశాంతసమాగతమందమారుత
శ్రీగరిమానుభావవివశీకృతమానసుఁడౌచు నట్టె ని
ద్రాగతి నంది కల్యవిధులన్ మఱచెన్ దగునేకదా నిశా
జాగృతిసేయు నిద్రకు వశంవదమౌట జనంబు వేకువన్

ఉ॥ ఇంకను నిద్రలేవఁ డిదియేమని మిత్రుఁ డొకండువచ్చి సా
తంకమనస్కుఁడై కని నిదానముగా గ్రహియింపఁగల్గె మీ
నాంకచిరప్రగుప్తరతిహస్తలచ్యుతమోహనాస్త్రని
శ్శంకహోమమిద్దియని జ్ఞానులెఱుంగని తత్త్వమున్నదే ?

ఉ॥ ఆవిధిఁ గొంతసేపు హృదయంబున మిత్రుని వర్తనంబు సం
భావనఁజేసి వాని కుడిప్రక్క నెసంగుచు నిద్రలేపె వా

నీవనితామణీచరణనీరజయుగ్మసదార్చనక్రియా
శ్రీవిలసత్కరంబున స్పృశింపుచు మెల్లనఁ బేరఁబిల్చుచున్.

సీ॥ గంగాతరంగవాఃకలకలధ్వనిలోన
భవదుషస్స్నానసంభ్రమము లేదు
అరుణోదయాత్పురాయాతానిలములోనఁ
ద్వత్స్తోత్రపాఠోక్తిధాటి లేదు
వాణీవిపంచికాబంధురశ్రుతిలోన
యుష్మదుక్తిమరంద మొలుక లేదు
ప్రత్యహార్యమఖకృతప్రోథకృత్యములోనఁ
దావకమాతృవందనము లేదు
గీ॥ ఎఱుఁగ నీనాటివేకువ నేమికతమొ?
జటలశాస్త్రీయవిషయచర్చావిధాన
సంశయగ్రంథిభేదనశక్తియా! శ
రీరపీడావిచారమా! శారదా ప్ర
సాదవైముఖ్యమా! వయస్యా! వచింపు.

చ॥ కలకలలాడు నీకనులు క్లాంతములైనవి హేతు లేమి? మి
త్రులు వినరానిదున్నె? మనలో మనమాటగఁ జెప్పరాదొ నీ
లలితతనూపరిస్థితి, విలాస! మనంబునఁజెప్పరాని వ్యా
కులతజనించె నాకు, నిశి కూర్కుజయించితి వేవిచారమో!

ఉ॥ నాదొక మాట, కోపమగునా? వచియించిన, తావకీనచి
త్తోదయదుగ్రవేదన మహో! వరికింప, నపూర్వరూపరే
ఖాదరణీయదివ్యవనితాననపద్మవిలోకనప్రభా
పాదితమంచు నమ్మెదను ప్రాణసమానుఁడ వంత యేకదా!

ఉ॥ రాత్రిరి, మూడుమూర్తులు విలాస! దురంతభవమ్మనో మహా
యాతనఁజూచినాఁడ, క్షణమైనఁబరుండినజాడలేదదే
హేతువొ చెప్పరాదొ? మనయీశ్వరిపాదముదప్పినట్లు నీ
చేతములోని వేదనవచింపకయున్నసటన్న, నాతఁడున్.

శా॥ నీతోఁజెప్పఁగరానిగోప్యమొకటున్నె! యన్న! వేదాంత వి
ద్యాతాత్పర్యవిశేషభావనవివాదంబుల్ విసర్జించి మ
చ్చేతోదుశ్చరితంబుఁ జెప్పుటకు లజ్జింతున్, మహాత్ముండ వే
రీతిన్ నీచవిఁబెట్టఁజూతు వవనిత్రిభూతమచ్ఛీలమున్.

శా॥ ఏకంగాదననేల నీవడుగ నన్నా! బ్రహ్మవిద్యాపరి
ష్కానైర్మల్యకళాపరీతమగు నాస్వాంతంబు లోకోత్తర
స్త్రైణాతీతవధూకటాక్షవిధిశిక్షాక్షోభితంబయ్యె మం
థానక్ష్మాధరచాలనక్షుభితదుగ్ధాంభోధిచందంబునన్.

చ॥ గతదినసాంధ్యకాలమున గాంగఝరీతటి సంధ్యవార్చి ని
ర్గతమలయానిలాంకురతరంగవిలాసమనోజ్ఞతావశీ
కృతహృదయుండనౌచు వసియించితి నేక్షణ, మంతలోన శ్రీ
సతియననొక్కకన్య జలసంగ్రహణార్థమువచ్చెఁజెచ్చెరన్.

ఉ॥ అప్పుడు నేను మందమలయానిలసంగతి నోలలాడు గాం
గాప్పుల నుల్లసిల్లు నవకైరవశోభను జూచుచుండఁగా
గప్పున సౌరభంబొకటి, కాంతధరించెడునూపురాల తేఁ
జప్పుడు నాదువీనులకుఁ జల్లఁగ సోకఁగ మోముద్రిప్పితిన్.

ఉ॥ ఆమెయొఁ దన్ని మేషమున నంబుజపత్రనిసర్గసుందర
స్థేమమునాహరించు వికచీకృతదృష్టుల నన్ను నోఱఁగా

శ్రీమృదురీతిఁ జూచె, నిఁకఁ జేసినదోసము చెప్పఁ బోవు, నే
నేమివచింతు మిత్రమ పరేంగితమున్ గ్రహియించు నీకడన్.

ఉ॥ ఆయమ రాజొ అనూవు కుసుమాయుధుతూవన సేపుమీఁజ నే
నాయెడఁ గొంత సేవు హరిణాంకసమాగమలబ్ధి దుగ్ధపా
నీయధిరీతిగా, క్షుభితనిర్మలచిత్తుఁడనైతిఁ దద్వధూ
స్ఫాయదపాంగమాధురికిఁ జాలవుసూ హరిణాక్షిలౌల్యముల్

ఉ॥ కాలికినూపురాలు ఘలుఘల్లున సందడిసేయఁ గంఠసూ
త్రాలు తళత్తళల్మెరయ రాజిలు తత్సతి మెల్ల జూహ్నపి
కూలమునుండి మెట్లపయిఁగుక్కుచుఁ బోవుచునుండ రెండునే
త్రాలును జాలవెవ్వనికిఁ దద్విభ్రముండ నిఁకేమి చెప్పుదున్

చ॥ పరిణయమైన కాంత నిటు వాంఛయొనర్చుట తప్పుగాదె? నీ
కరయనటన్న దానివివయంబును జెప్పద నాలకింపు మీ
వలికట స్వప్నమందు మనవానిఁ గనంబడి కన్యైనంత కం
ధరమున నూత్రిమించెలు పదంబుల నన్ వరియింపఁజేయఁగన్

చ॥ అదియును గాక నొక్కవిషయంబు, తదంగనజన్మగాధ చి
త్రిదమును మీ వియన్నదికిఁదాపున నొక్కటఁ గుంజవాటికా
సదనము నందు నవ్యతమశయ్యావరుండలభించెనంట నే
నిది కనుఁగొన్న దివ్యజలజేక్షణయన్నతలంపుగల్గెడున్.

సీ॥ సర్వలోకోత్తమసౌందర్యరేఖావి
శేషసౌభాగ్యవిభూషయాట
వాణీప్రసాదసంబద్ధమంగళసూత్రి
నూపురాలంకారనూత్నయాట

గంగానదీకూలకలితకుంజాంతర
ప్రసవశయ్యాసీమలబ్ధమౌట
అతిపావనాస్మదీయాదిసందర్శన
వ్యాపారమాధుర్యపాత్రమౌట

గీ॥ ఆమెను పరిగ్రహింప నాయంతరంగ
మాశపడుచుంట నెట్టులాయని తదేక
చింతనాదోలికాయితశాంతహృదుఁడ
హితుఁడ నీవెఱుంగనిది యింకేమిఁగలదు ?

చ॥ అన విని తద్విచిత్రవిషయంబున కీషదుదంచితస్మిత
ప్రణయరుషోక్తి నాతఁడిటు వల్కఁగసాగెను యుక్తమేకదా !
తన సుహృదుఁడొకండు విషయస్పృహ దుర్గతినేగుచుండఁగా
వనగుణుఁడైనవాఁడు తగుపద్ధతి వానిని మందలించుటల్

చ॥ అరెరె? విలాస! నీవిషయమంతయుఁ జోద్యముక్షుద్రమానవా
దరణమలీమసంబయినదారిసుమీ! యిది, శారదాకృపా
స్ఫురితసమస్తవాఙ్మయవిభూషణభూషితశేముషీధురం
ధరుఁడవు హేయవస్తువగు స్త్రైణము నమ్మెద వెంత వెఱ్ఱివో !

ఉ॥ నీవు సమస్తలోకరమణీయతరస్పృహణీయరూపరే
ఖావిభవావధూతసుమకాండుఁడవౌట దృగంతదృష్టి నం
భావనఁజేసి నీ దమము భగ్నమొనర్పఁగ జూచుచుందురా
హా! వనితల్, తదర్థమెసఖా! మదినమ్మరు ప్రాజ్ఞులింతులన్

ఉ॥ సోదరుఁడైన నొంటిరిగ సుందరుఁడై కనిపించనేని శా
మోదయుసై లతాంగులకు నుల్లముతల్లడమొందునన్న శా

స్తోత్రితవాక్యమీ వెలుఁగవో! యెదురాడితినన్న కోపమో!
కాదొకవేళ సత్యమని గట్టిగనమ్మెదఁగాక నీకథన్

ఉ॥ కాని, విలాస! సాధుజనగర్హితమీవిషయాళి "కింబహూ
క్తేన" పవిత్రబుద్ధి విరతిఁగెకుఁబాదులు గట్టుచుంటి వెం
దైనఁగలాఁడె నీవలె ననర్హవిధారచనాప్రవణుండు లబ్ధవి
జ్ఞానుఁడ వేమి సార్థకత సారమసారమెఱుంగవింతకున్

ఉ॥ కామవికారభార మెదఁగ్రమ్మఁగ్రమ్మనుగాక; యౌవన
స్థేముడవాటఁగానిఁ బరిశీలనఁజేసి జయింపలేవొ యీ
కామము వాఁడె ధీరుఁడు వికారపుహేతువుకల్గువేళ ధీ
భూమ నెవండు చిత్తమును బూరిగఁ గట్టిచలింపకుండునో

ఉ॥ కాని మఱొక్కమాట జనగర్హితదుర్విషయోపభోగని
ధ్యానపరాయణత్వమునఁ దగ్గిసముగ్గిసలౌచునుంటి వ
జ్ఞానివిధంబుగా హృదయచాపల మెవ్వఁడు నిగ్రహించు వాఁ
డే నయశాలినాబడు బుధేశుఁడవయ్యెయొ యింతవెఱ్ఱియా?

ఉ॥ ఎక్కడనుండివచ్చె నసలింతటియింద్రియచాపలంబు నీ
చక్కదనాలమోమున విచారపురేఖలుకల్గఁజేసె పె
పెక్కిన ధైర్యలక్ష్మి యెటకేగె వశిత్వము చిత్తశాంతియుం
జిక్కని స్థైర్యసంపదయు జీర్ణములయ్యెనె నేఁడు నీమదిన్

చ॥ సరళగురూపదేశవిధిసారము వేదపదార్థవేదనా
గరిమ, విరాగితాదృఢిమ కామసముత్సుకతావిరక్తి ని
ర్భరమగుబ్రహ్మచర్యము తపశ్చరణానుభవంబు యౌవన
స్ఫురణపరాఙ్ముఖత్వ మెటువోయె నిరాకృతభోగలౌల్యమున్

ఉ॥ చారుమనీష! నీప్రతిభ సారవిహీన నిరర్థకంబు సం
స్కారము నిర్గుణంబు బహుశాస్త్రనిమిత్త వృథా గురూత్తమో
దారతపోపదేశవిధిధర్మవివేకము నిష్ప్రయోజనం
బారయ జ్ఞాన మీవె విషయాళికి లొంగితి వేమి చిత్రమో!

చ॥ ఇది స్వగురూపదిష్టము సరే మతి వైదికశాస్త్రపాఠసం
విదితము లేక మోక్షపదవీగతియుక్తియు కాక సద్వ్రతా
భ్యుదయము! పోని స్వర్గగమనోత్తమమార్గము! పాఱుఁజూడు మే
య్యాదిఫల మా సతీగ్రహణమందుఁ దృతీయసుఖానకందువా!

కం॥ మీసాలమీఁది తేనెలు
నాసాగ్రన్యస్తకుసుమనవపరిమళముల్
భాసురవీణాక్వణు లా
భాసానందైకనిధులు స్వప్నసుఖంబుల్.

ఉ॥ కామరతంబులెల్ల క్షణకాలసుఖంబులు కాన దివ్యవి
ద్యామధుపుండ వీ ఫలములందుటకై మది నాసప్రాకు దు
ష్కామముతో శతాబ్దములఁ గ్రాలుట కన్న సదీహతోడ స
ద్యోమృతినంద మేలు, మనముండిన దూరముపాఱఁజూడుమీ!

ఉ॥ ఉపభోగక్షమమైన యౌవనము నీకున్నంతకాలంబు నీ
విపరీతంబగు కామతృష్ణ యిటులే పీడించుచుండున్ విలా
స! పరిజ్ఞానము కల్గినందు కిదియా సాత్ప్యంబు దుర్వార్ధక
స్ఫురణం బెప్పుడువచ్చిమీఁదఁబడునో పోనీ విచారించితే?

ఉ॥ ఈవిషయం బిటుంచు మనమింతకుఁబూర్వ మొకానొకప్డు నా
తో వివరింపలేదె? మన తూరుపు మామిడితోఁటలోన నా

జీవిత మిత్తు దీనజన సేవనకో మఱి దివ్యతీర్థయా
త్రావిధికో తపంబునకొ ధర్మముకోయని, జ్ఞప్తియున్నదే?

కం॥ ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతంబులలోన నేది ప్రామాణ్యంబో
చూతును నానావిద్యా
స్ఫీతుల వాదించి యనుచుఁ జెప్పితిగాదే?

సీ॥ త్రిమతభాష్యాలపైఁ దివ్యనిభావలో
వరటీక నొక్కటి వ్రాయరాదా!
ఉపనిషత్తులనెల్ల నురుమేధశోధించి
తొలిలేని యొకపంథఁ ద్రొక్కరాదా!
ఆగమార్థస్ఫూర్తి నవలోకనముసేసి
సారాంశమెద్దియో చాటరాదా!
స్మృతిపురాణావళి నతిరక్తిఁ బరికించి
నిష్కృష్టతత్త్వంబు నిలువరాదా!

గీ॥ కష్టపడి నేర్చుకొన్న విజ్ఞానమెల్లఁ
పాడు విషయాభిలాషలపాలు సేయఁ
బుణ్యమా! పూరుషార్థమా! బుధవరేణ్య!
జగతి సత్కావ్యరచన శాశ్వతముగాదె?

గీ॥ ఈ పెఱుంగని విషయ మింకేమిగలదు
కావున విలాస యింక లెమ్ము కమలబంధు
వడుగో! ప్రాగద్రి గురుపాదు లరయువత్తు
రాశ్రమంబును మనమట కరుగవలయు.

కం॥ ఈ దోసమెల్లఁబోవుట
కేదిన ముపవాసముండి యేతద్వాణీ
పాదసరోరుహసీమా
వేదిక గాయత్రీజపము వేలొనరింతే.

కం॥ ఆశ్చర్యమంద నేల వి
పశ్చిద్గణనీయశీల ! వడయుము లోనన్
బశ్చాత్తాపము "విప్రాః
పశ్చిమబుద్ధయ" యనంగఁ బ్రాఁబలుకనదే ?

చ॥ అన విని వానిమాటలకు నబ్బురపాటునుగాని, లేక, యూ
నని తలయూఁచితాని, స్వమనంబునఁ గుందుటకాని లేక మె
ల్లన నగి లేచి మిత్రునికరంబును జేతబిగించి పట్టి దాఁ
జనియె, నదొక్కచిత్తమున సాగెను గొన్ని దినంబు లీగతిన్.

సీ॥ శంభుతార్తీయీకచక్షురత్యుజ్జ్వల
ద్వహ్నికీలాభీలతైక్ష్ణ్యమొక్కొ
పాపిశిక్షాకాలప్రగుణీకృతక్రోధ
తాపితయమనేత్రతాపమొక్కొ
విమతనాశనహరిప్రేషితభీమసా
దర్శనాశ్రివిభాదైర్ఘ్యమొక్కొ
మందేహరాక్షసోన్మథనవేళావేళ
ధగధగచ్చండాంశుదాహమొక్కొ

గీ॥ అనెడు విభ్రాంతిఁగొల్పు గ్రీష్మాఖ్యఋతువు
ప్రళయవిరమణకాలమర్వారవాత

వలన సంక్షుబ్ధసాముద్రప్రబలబడబా
వహ్నికీలౌష్ణ్యధాటిగా వచ్చెనంత.

చ॥ హారిహారి ఎండమావులయొయ్యారము నూచి మృగోత్కరంబు ని
ర్ఝరజలమంచు భ్రాంతిని సరాసరి నయ్యెడ కేకధాటిగా
వరువిడి నిల్చుచున్ మరలఁ బర్వులువెట్టి ఫలంబులేక భీ
కరముగుగ్రీష్మవేళ వడగాలికి సోలుచుఁ జేరెఁ జెట్లకున్.

ఉ॥ కాలముగ్రీష్మమాటఁ ద్వరగా నపరాశకుఁ జేరుకోర్కెఁ గ
ళ్యాలను గుంటిసారథిని లక్ష్యముసేయక పర్వులెత్తు గు
ఱ్ఱాలమదంబడంప రవి రంహతిపూన్చి క్రమక్రమంబుగాఁ
దోలుచునుండె నేమొ యనఁదోఁచెను బ్రొద్దులు పెద్దవౌటచేన్

ఉ॥ దోసిటనిండుగాఁ బ్రపలఁ దొయ్యలి చల్లనినీరు ధారగాఁ
బోసిన వ్రేళ్ళసందు విడఁబుచ్చుచు నధ్వగుఁ డెండ కెంతయో
గాసిలుచున్నవానివలెఁ గ్రోలుచు నింకనుబోయుమంచు పే
రాసను బైకిఁజూచు నిదియంతయు మోహమొ లేక దాహమో!

ఉ॥ నిమ్మఫలాలసారమును నింపిన చల్లనినీరుమోరు మా
ర్గమ్మునఁ బానశాలలను గాంతలు వ్రాయుచునుండఁ ద్రావి తా
వమ్మిట నెక్కువయ్యెనని పందిరిలోవలఁ గూరుచుండు, మో
హమ్మెద రేపఁగాఁ గతిపయాధ్వగు లింతుల చెంత వింతగాన్.

ఉ॥ డెందములోన వేడి వికటింపఁగ నాఘనగ్రీష్మకాలమ
ధ్యందినమందు నొక్కసమయంబునఁ జేరె విలాసుఁ డొంటి మా
కందమహీజబృందఫలకమ్రవినమ్రలతేత్థశాఖికా
తుండిలసుందరోర్మిజలతోయరుహాకరసన్నిధానమున్.

ఉ॥ ఆసరసీరుహాకరతటాంతమునం దొకచో రసాలశా
ఖానవమాయుగాఢలతికాపరికల్పితకాయమానవీ
థీ సుకుమారశాద్వలప్రదేశమునందు సుఖానుభూతిలో
భాసిలుచుండఁగా నావరివస్త్రము వేసి వసించియుండఁగన్.

ఉ॥ ఆరమణీయదృశ్యకలనాంచదుదంచదమందహర్షవి
స్ఫారితమానసంబునకుఁ జయ్యన జ్ఞప్తికివచ్చె నల్లనా
దారమణీమణీవిషయమంత విచారణ సేయసాగె వి
ద్యారసికుండు పైన నవయావనుఁడౌట నతండు వింతగాన్.

ఉ॥ ఆ కలహంసవల్కిన కథాంశముఁబట్టి సమీక్షసేయ వా
ణీకలకంఠి యీమె యని నిక్కముగా గనిపించు నైనచో
నా కమలాసనుండు తిరుగాడెడు నేడనొ! పుత్రికాకథా
లోకనఁ జేయు నాతఁడని లో ననుమానముగల్గు సత్యమో
లేక యసత్యమో తెలియలేవు తదీయపునఃపరిస్థితుల్.

ఉ॥ ఈవిషయం బిటుంచు మిదియేమి విచిత్రము కాని యా గిరాం
దేవి నిశీథస్వప్నమున ధీరు విలాసునిఁదక్క నన్యు నెం
భావన సేయఁబోకుమని మంగళసూత్రము నూపురాలు ని
ద్రావృతినుండ గట్టెనని తా వచియించునదెంత సత్యమో!

ఉ॥ మాటలఁ బట్టిచూడ ననుమానము గల్గదు సుంతయైన నా
పాటున నాకు స్వప్నమున వాణిగనంబడి వల్కెదెప్పు డీ
బోటిని పెండ్లియాడుమని పొమ్మిఁక నిట్టిప్రసక్తిమాన నా
నాఁటికి నామెరూపము మనంబున కెంతయు హాయిగొల్పెడున్.

ఉ॥ ఏమి యుపాయమంచు మది నిట్టు విలాసుఁడు చింతసేయ నా
సీమను బాంచియున్న యొకచెడియ ముందున కేగుదెంచి యో

స్వామి "యితఃపుర" తమరు జహ్నుసుతాతటిఁజూచినట్టి యా
కోమలికమ్మ బంపె నిదిగోయని చూపన విస్మయేక్షుఁడై

ఉ॥ ఎవ్వరిదాన వీవిచటికెవ్విధి వచ్చితి పేరు సెప్పి రే
నివ్వనినుందువంచు యువతీ! నిజమాడుము కమ్మ యేమి యా
జవ్వని యేమి? పొమ్మఁకను జాలు సతీర్థ్యులు నూచియున్నచో
గవ్వకుఁగూడ నేను గొఱఁగానన దుఃఖనిరుద్ధకంఠియై.

మ॥ అకటా! యేమని చెప్పఁగొందును దురంతంబైన మాబాధ నో
సకలశ్రోత్రకలావిలాస! యని సాష్టాంగప్రణామక్రియా
శకలీభూతశరీరశంధియగుచున్ సవ్రిశ్రిమోత్కర్షదీ
నకథాసూచనయై వచించె నిటు లానమ్రోర్ధ్వకాయస్థితిన్.

ఉ॥ ఆ దినమందు గాంగసరిదంతికసీమఁ ద్వదీయరూపరే
ఖాదులఁగాంచి మన్మథవికారము మీఱఁ దపించుచుండె మా
గాదిలియాళి సత్యమిది కైకొన దాహృతి నాఁటినుండి స్వా
మీ! దయతోడ నామెలిఖియించిన లేఖను బాఱఁజూడుమా!

ఉ॥ భాసురశీల! నాకు సహపాఠిని యామె మహాకవిత్వవి
ద్యాసరతాత్మ యాట హృదియందలి తాపము నెల్ల లేఖలో
వ్రాసి వచించె నిట్టు, సఖి ప్రాణసమానము దీని నాకలా
వ్యాసున కిమ్మటన్న నిటు వచ్చితి మీపదపద్మచిహ్నలన్.

చ॥ అని లవలీనికుంజలతికాంతరసీమను మెల్ల డాయఁబో
యిన యువతీ! మఱేమి భయమిప్పుడు లేదటఁ గూరుచుండు మీ
దినము చతుర్దశీతిథి సతీర్థ్యులు కొందఱు స్వీయగేహ ద
ర్శనమతి నేగినారొకఁడు రాఁడొకఁ డెవ్వఁడు లేఖ నామె యే
మని లిఖియించె నీవె వనితా పఠియింపుమటన్న నామెయున్.

మ॥ అపడక్షీణ మిదంచుఁ దానొసఁగెనయ్యా కమ్మ నా చేతికి
విపయుంబేను పఠియించుటొప్పగునె? మీరేచూడు డిట్లాడుచో
రుప లోఁ బూనెద రేమొ నావయిని గారో మీరు మర్మజ్ఞులో
ఝష కేతూత్తమరూపయున్న నత డుచ్చాభ్యసించి జాబందినన్.

ఉ॥ ఈయెడఁ గూరుచుండు డిఁపుడే చనుదెంచెద నంచు లేది చే
చాయగఁ గొంతదూరమటుసాగి గమించె తదాళి పైన నే
మాయెను జాడలేక యతఁడట్లె నిమేషము నూదిఁ చందన
స్ఫాయుదఖండసౌరభపశంవద లేఖను విప్పి చూడఁగన్.

ఉ॥ అందున నిట్లువ్రాయఁబడె నద్భుతవైఖరి నోజగత్త్రయీ
సుందర ! దివ్యవైదికవచోవిభవార్జితదిగ్జయేందిరా
మందిర ! సర్వలోకబహుమానితబ్రహ్మకులాబ్ధికార్తికీ
చందిర ! శ్లాఘనీయగుణసాంద్రపురందర ! వందనం బిదే !

ఉ॥ నాకథ సర్వమో హృదయనాథ ! యెఱుంగుదు కల్లనాఁడు సం
ధ్యాకమనీయమందమలయానిలచుంబితమల్లికాసుమ
శ్రీకరజాహ్నవీలహరిచెంగట మీకొక విప్రకాంత దై
న్యాకులచిత్తవృత్తి నదయా ! వినిపింపఁగ సావధానతన్.

ఉ॥ చారుసరస్వతీపదముసాక్షిగ సత్యము సెప్పుచుంటి నో
ధీరకులావతంసమ మదీయగళాంఘ్రుల నుంచిపోయె సొం
పారఁగ నీవె భర్తవని మంగళసూత్రము నూపురంబు లీ
శారద నాకు రేయి ధృతిసాలక చెప్పకపోతి నయ్యెడన్.

ఉ॥ ఆదివసాంతమందు సరిదంతికసీమను మిమ్ముఁజూడ మో
హోదయ మయ్యె నాకు హృదినుజ్జ్వలరూప సమస్తమానసా

హ్లాదనకార్యదక్షకరదబ్జసమీక్షఁ గువాలయంబు స
మ్మోదము చెందునట్లు పెడఁబోవునె యోగ్యకులీనభావముల్.

ఉ॥ ఆయమునాఁటిసౌంధ్యసమయంబున నెప్పటిపోలె జాహ్నవీ
సీమఁ ద్వదాస్యదర్శనము సేయవసించితిఁ జాలసేపు కా
నీ మహనీయశీల గమనింపఁగలేదవుడీరు మీమనః
కామవిధానమేమి? నను గాచుటయా! మృతినందజేయుటా!

ఉ॥ అప్పుడు మీసమీక్షమున నంతగ నాజననాదివృత్తముం
జెప్పినతల్లి నేఁడు స్మృతిసేయదు తద్విధమంతకాక నా
కిప్పుడు పెండ్లిసేయు మొదలెత్తెను మంగళసూత్రనూపురా
ల్చొప్పడియుండె జూడుమని చూపినఁ గన్పడవంట కంటికిన్.

ఉ॥ ఆసమయాన నావిషయమంతయు నామెకు యుష్మదాస్యసు
శ్రీసమవేక్షణాప్తి స్ఫురియించెనటంచుఁ దలంతు! గానిచో
భూసురవంశమౌక్తికమ! బొత్తుగ నిప్పుడు తత్ప్రగాఢథా
వాసన పోవనేటికొ వివాహము పెండిము సేయ నేటికో.

ఉ॥ కావునఁ దల్లిదండ్రు లిటు గట్టిగ పెండిలి నాకు సేయ లో
భావన సేయుచుండిరికఁ బాదములందు గళాన నున్న వా
ణీవర భూష లేరు గమనించిన గన్పడ వేదదక్క గం
గావిమలాంబువా! భవదఖండకృపామృతమూ వచింపుమా!

ఉ॥ చల్లనిగాలి సోఁకినను జంద్రుఁడువచ్చినఁ గోయిలంబు దా
నల్లఁ గుహూకుహూయనిన నయ్యయొ, నిక్కము తల్లడిల్లు నా
యుల్లమదేమిహేతు విటు లంటకుఁజెప్పుము, విద్వదగ్రణీ
కల్లలుగావు నా నుడులు కైకొన నాహుతి నీ నిమిత్తమై.

ఉ॥ ఏ విషయంబు వేగ లిఖియింపుము నన్ను వివాహమాడు లో
భావన సేయఁబూనుటది భావ్యము కాదనెదేని శారదా
దేవి పదంబె సాక్షి యిఁకధీవర! ప్రాణము నిల్పె గంగయం
దే; విడుతున్ ద్వదర్థమయి యిట్టుల మీ పదదాసి "ఇందిరా."

ఉ॥ అంతయుఁ బాఱఁజూచి హృదయంబునఁ గోర్కులు మొల్కలెత్తలే
ఖాంతకసర్ణవంక్తులకు నబ్బురమొంది మఱొక్కసారి దా
సాంతముగాఁ బఠించె నిటులొసుమి ప్రేముడియున్నచోటులో
నెంతగవిన్నఁ జూచినను దృప్తిగనంబడ దెన్నినాళ్ళకున్.

ఉ॥ ఆవిధి లేఖనెల్లఁ బ్రియమారఁగఁజూచి పునస్సమాధికో
భావము నొందకుండ నొకవైఖరినుండెనతండు మిత్రివా
చావిమలోపదేశమును సల్పుటయో! మఱిలేక యిందిరా
దేవిని పెండ్లియాడుటయొ తీఱనిధార్మిక సంశయంబునన్

కం॥ పరిపరి విధముల మనమున
నరయుచు నిశ్వాసమారుతాహతిగరిమ
స్ఫురదధరోష్ఠుండగు చీ
సరణిని వ్రాయంగఁదొడఁగె జాబును ప్రేమన్.

కం॥ ఇందూ! యెంతటి హృదయా
నందంబగు పేరునీది; నారాయణహృ
న్మందిర గతయగుసాక్షా
దిందిరకును, నీకు భేదమేమో చెపుమా!

ఉ॥ నాదొకచిన్నమాట; రతనంబను వస్తువు మృగ్యమాను గా
నీ, దిశలెల్లఁ దాఁ దిరుగనేర్చునె? నన్ను వరింపుమంచు, నీ

వాదరణీయరూపయుతవయ్యు విచారణసేయుచుంటివి
మాదిరివానికోసమయి; మానిని! యెంతటివెఱ్ఱిదానవో!

గీ॥ భారతీదేవి శేయి స్వప్నమునవిలచి
కట్టెనంటివి మెడను మాంగల్యసూత్రి
మావిలాసుని నీవు పెండ్లాడుమనుచు
సత్యమోతే కసత్యమో సాక్ష్యమేమి?

ఉ॥ నీమెడలోనినూత్రిమును నీచరణంబులనూపురాలు మా
కేమియుఁగానరావు తరుణీ! నిజమెట్లునినమ్మవచ్చు కా
నీ; మనమాట నీకు నల నీరజగర్భసతీపవిత్రిపే
మామృతవాహినీలహరికార్ద్రికటాక్షమె రక్షయైనచోఁ

చ॥ వదుగురుకూరుచుండిన సభాస్థలిలోఁవలగాని శారదా
సదనమునందుఁగాని నను శాస్త్రవివాదమునఁ జయించి యో
మదవతి! పెండ్లియాడుమిఁక మాటలతోడ ఫలంబులేదను
మ్మిదియె మదీహయంచు లిఖియించినజాబు తదాళికీయఁదా
వెదకియుఁగానరామి నటఁబెట్టి విలాసుఁడు వోయె నింటికిఁ

ఉ॥ జ్ఞానకలానిధాన విలసత్కవితారచనావధాన కా
శాని నృసింహరాయకవికావ్యసుతాకలితావదానవై
జ్ఞానికమండలీసువరిమద్భరవాహకతానిదాన! వి
ద్యానిధివీరరాజతనయా! స్తవనీయనయా! మహాశయా!

ఇది

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్య ప్రణీత

విద్యావిలాస ప్రబంధ

తృతీయోల్లాసము



శ్రీ హయగ్రీవ స్సహాయః

# విద్యా విలాసము



## తురీయోల్లాసము



క. శ్రీతిరుపతిశుభయాత్రా
ప్రీతాంతఃకరణజనితవిద్యారేఖా
జ్యోతిర్విలసితకాయా!
సీతారామాంజనేయ! శ్రీకవిగేయా!

ఉ॥ ఆ సమయంబునందు స్వగృహాంతరవేదిక నొక్క గొప్ప స
న్న్యాసినిబోలె నారయ గనంబడుచుండునుగాని, కాదదే
దో! సహింపరాని యొకదోసముఁజేసి కృశించురీతి ని
శ్వాసపుదైర్ఘ్య మానవవిషాదము దృష్టినిరాశ దెల్పెడుఁ.

చ॥ మలినదుకూలధారణము మానసమందు వచింపరాని వ్యా
కులతను జూపుచుండ ముఖకుంకుమరేఖ విలోలకుంతలా
కలనవిశేషధూతమయి క్రాలి దురంతవియోగమూర్తి నా
నలరెడుకాంత యోర్పు పితయుండవసించి నికుంచితాక్షియై.

ఉ॥ ఈ విధిఁ జెప్పుచుండె మొదలెత్తి స్వకీయవిషాదగాథ నో
దేవ ! మహాపవిత్రభవదీయపదాంబుజదర్శనాప్తి నా
జీవితమందు నేఁడొకవిశేషముకల్గె మహానుభావసం
భావనకల్గునే గతభవంబున మాకు తపంబులేనిచో.

ఉ॥ ఏమని తెల్పుకొందు కృశియించెడు నా హృదిలోని తాప మో
స్వామి ! మహానుభావ ! సహజంబగు సిగ్గునుగూడ వీడె నీ
కోమలియంచు నావయినఁ గోపమునూపిన నిల్వఁజాలఁ గా
నీ మనసావలేక మహనీయులు మీరని చెప్పవచ్చితిన్

ఉ॥ ఈ మహిఁ దల్లిఁదండ్రి తమ రేయని యెన్నుచుఁబొంగుచుంటి నా
క్షేమము మీరు గోరిన వచింతురుగాదె? భవిష్యదర్థ మే
దో ! మహనీయచిత్తములఁ దోచుఁగదా నతులైనవారి కే
మేమి ఫలాఫలంబు లుదయించునొ ! కంటికిఁ గట్టినట్లుగా.

ఉ॥ ఏమన నాదినుండి వచియింతు వినుండిఁక రత్నగర్భ నా
నామము ప్రాణనాథుఁ డొకనాఁటి నిశీథి సవత్నితోడ ని
ద్రామహితప్రమోద మెదదాకిన నన్నుఁ ద్యజించిపోయె నే
భూమికొ తెల్లవాఱి కనబోయిన నిర్యరు లేరు సెజ్జపై.

ఉ॥ ఎక్కడికేగినారనుచు నెంతయు లో నవమానబాధ పెం
పెక్కఁ శుగశ్రుబిందునిహతేక్షణ జూచితి నాల్గుమూలలన్
బ్రక్కలఁ గేళికాసదనభాగములెల్లను జాడలేక యిం
కెక్కడఁ గాదటంచుఁ బరుగెత్తి గమించితి నిష్కుటాసరున్

సీ॥ వెదకితి నుత్తుంగవివిధగోపురచారు
నవ్యశృంగారమంటపములెల్ల

సరసితి వాపికాసరసీకటోపాంత
గుంభితైలాలతాకుంజతతులఁ
బోయితి నిర్ఝరీముగ్ధసైకతభూమి
కృతపాంసుకేళికాగేహములకు
డాఁగితి సహకారపూగరంభానారి
కర్ణదరుల

గీ॥ అడిగితిని జేరఁబేరఁ గన్పడినవృక్ష
పక్షిమృగనగాదుల నేవిపక్షలేక
యెచ్చటను వారిజాడల నెఱుఁగరాక
కూలఁబడిపోతి నొకచోటఁ గొంతసేపు.

ఉ॥ ఆయెడనుండి లేచి నదియందున స్నానము సేయఁబోయి రే
మో యని రేవురేవునకుఁబోయితిఁగాని ఫలంబు సుంత లే
దాయెఁగదా! మహాత్మ! ప్రియుఁడంతకు నీగతిముంచెనంచు నా
దేయతటంబునుండి యిఁక దిన్నఁగ నింటికి దారిఁ బట్టితిన్.

ఉ॥ ఎంతకుఁ బ్రొద్దుపోదనుచు నేనొకనాఁటి దినాంతవేళ గే
హాంతరమందు నొంటరిగ నల్ల విపంచికఁ జేతఁబూని హృ
త్కాంతుగుణాపదానముల గానము సేయ నుపక్రమింప న
త్రాంతరనిర్యదశ్రుకలనార్ద్రములయ్యెను దంత్రులన్నియున్.

సీ॥ చిత్రింబులో నాథు సృష్టించి వీక్షింప
నశ్రుధారలు దృష్టి నడ్డగించు
ప్రణయగీతము వ్రాయఁ బద్మపత్త్రముఁగోయ
నిట్టూర్పువేఁడికి నట్టెవాడు

విరహాగ్నిదాటికి నోఁచుఁగఁ బల్లవళయ్య
నందు మర్మరరావ మావహిల్లు
హృదయేశుగుణముల నెల్లెత్తి పఠియింపఁ
గంఠదుఃఖంబు విఘ్నంబొనర్చు

గీ॥ తాపశాంతికి మేనఁ జందనముఁ బూయ
నదియు నింతంతగాఁ బట్టువదలిరాలు
అన్నము విసంబు విసము నాకన్నమయ్యె
నయ్యె యూర్మిక కంకణంబయ్యెఁ దుదకు.

చ॥ కలదొకతప్పు నావలనఁ గారణమేమన నొక్కనాఁడు మా
టల 'పదసంధి' లోపలఁ దటాలున నంటి సపత్నికేర్ష్య 'చం
చల'కును 'రత్నగర్భ'కును సామ్యమదేమని యాతఁడంత మా
ర్వలికె వసైనఁ బద్మినియుఁ బాంసులయున్ సరివారలేకదా.

చ॥ అనుటయుఁ దద్విచిత్రవచనాంతరగూఢపదార్థభావనా
ఘనతకు నాసపత్నికిఁ బశ్చాత్తాపముగాఁ దెల్లఁబోయి నా
థుని నుడి చర్చసేసి యొకదోసము నప్పుడు గుర్తెఱింగి నె
మ్మనమున నావరాని పెనుమానముచే బరికింపితోషినె.

గీ॥ జడచరుండవు సాకర్యచర్యగరిమఁ
బుణ్యజనులను జంపు నీబోటివాని
కింతి పాంసులగాక యింకేవతెవచ్చు
ననుచు నటువైపు తిరిగితి నంతె సామి.

గీ॥ వేకువను లేచిచూడఁ గన్పింప రియవు
లేమిసేయుదు నెటకని యేగఁగలను

విసిగి వేసారిపోయితి వెదకి వెదకి
స్వామి! స్వకృతాపరాధంబు శాంతిఁగనదె.

ఉ॥ ఈ వలుకాడినందులకె యింతట శిక్ష విధింపన్యాయమా
నే? వరికింపుమయ్య మహనీయచరిత్ర! దురాగ్రహాప్తి ని
క్షేపమువంటి భర్తను త్యజించిన పాపచరిత్రురాల లో
లోపలఁ గాల్చు నీ హృదయరోగముతోడ నశింపకుండునే.

చ॥ అసలిది కాదు లెండు విషయంబు మఱొక్కటియుండె మీకు లో
విసుగు జనించునేమొ సరిపెట్టుదునాయని కొంచెమాగి మా
నసమది యేమొ చెప్పుమన జ్ఞానికులోత్తము దెల్పుచుంటిఁ దా
వసులు త్రికాలవేదులనఁబట్టెగదా మిము నాశ్రయించుటల్.

ఉ॥ నేనొకనాఁడు సహ్యధరణీధ్రసుతావిమలప్రవాహవీ
చీనిచయప్రచారవికచీకృతపద్మపరీమళాప్తిమం
దానిలపోతచుంబితగృహాంగణకౌసుమకాయమానసో
పానమున న్వసించుచుఁ బ్రభాతపుశోభను జూచుచుండగన్.

ఉ॥ ఆ సమయంబునందు నదియందున స్నానము సేసివచ్చు వి
ద్యాసరసుం డొకానొక మహాత్ముఁడు శిష్యుఁడు వెంబడింప "క
ప్యాసము పుండరీక" మను వైదికసూక్తికి వానరాసన
ప్రీసమ మామురాంతకుని దృగ్యుగమంచు వచింపుచుండగన్.

ఉ॥ ఆవిపరీతమైన నిగమాంతసమన్వయము నాలకించి దుః
ఖావిలుఁడౌచు శిష్యుఁడు దృగంతరనిస్రుతబాష్పధార తే
జై వడిఁ బాఱుచుండ నవురా యని నేలకుఁ గూలిపోయి స్వా
మీ! విరమించుకొండు నిఁక నింతటినుండి భవద్గురుత్వమున్.

చ॥ హరిహరి! యెంత హేయపు సమన్వయమయ్య గభీరవారివి
స్ఫురితసుమృష్టనాళరవిపుష్టివికాసితపుండరీకసుం
దరదళశోణకాంతికలనాతులితాయతలోచనుండు శ్రీ
హరియని చెప్పగూడదొ? తదాగమసూక్తికి దేశికోత్తమా!

మ॥ కలిసంతారణసిద్ధభేషజములై కల్యార్కనూత్నోదయో
చ్చలితాంభోరుహపత్రసుందరములై సంసారదావానలా
కలనాంభోదములై కృపాకరములై కల్యాణరేఖామయం
బులునా భాసిలు విష్ణునేత్రముల బాబూ యిట్లు వర్ణింతువే.

శా॥ ఈశిష్యత్వము మాకు మాగురుత నాకేనాఁటితోఁ జాలు బా
బూ శాంతించెను నాయెడంద నిగమామూలాగ్రతత్త్వావలో
కాశాజ్యోతి భవన్ముఖోదితదురంతాపార్థఝంఝానిలా
వేళ ప్రౌఢిమ నొక్కమా తివిరియో! వేదాంతసూత్రార్థముల్.

చ॥ అన విని తీవ్రకోపచలితాధరుఁడౌచు గురుండు మూర్ఖ! నీ
కును దలఁదిక్కెత్తె ననుఁగూడఁ దిరస్కృతి సేయఁజాలు ధీ
ఘనత లభించెనేమి యగుఁగాక సరే యిదె? పూర్వపక్షవా
దనము పునర్వివాదవిధిఁ దప్పని నిల్పుము శక్తియున్నచోన్.

కం॥ అరయఁగ ఛాందోగ్యంబున
వఱలిన "కప్యాస" మనెడు భవ్యశ్రుతికిన్
మఱలన్ జెప్పు మదేమని
సరసత వచియించి తీవు చాలునిఁకంతన్.

శా॥ ఆసూత్రంబునఁ బుండరీకమను శబ్దార్థంబు నేమంటి వో
రీ! సాధింతువె? రక్తపద్మమని యేదీ చూపుమెందుండె నే

మీ ! సాహిత్యము మెచ్చుకోదగును లే యీపుండరీకార్థవా
చాసంస్కారము నేడ నేర్చితివి శిష్యా ! నీకె లోఁగల్గెనా.

చ॥ అమర నిఘంటువున్ సమితమారసి యుండఁగ లేనివాఁడ వే
క్రమమున శాస్త్రవాదమునకై మొదలెత్తెదు పుండరీకశ
బ్దమునకు నర్థమేమొ? సితపంకజమో ! మఱి లేక రక్తప
ద్మమొ సరిచూచి చెప్పుము వృథావిసిగింపకు మోయి శిష్యుఁడా.

ఉ॥ ఆ నుడి నాలకించి గురువాడిన వాక్కుఁ దృఢీకరించి నే
నా నికటప్రదేశమున కాపఁగరాని హృదార్తి నేగి స్వా
మీ నిలుమంత నేమి ఫలమిట్టి వివాదముతోడ "రంగరా
మానుజభాష్య మున్నది తదర్థవిచారణ దానఁ జూడుమా !

చ॥ అమరనిఘంటువొక్కటి సితాంబుజమంచు వచించునంతమా
త్రమున నె పుండరీకమును దద్విధిఁ జెప్పుటకూడదీవ లో
కమున మహాతపోనిధులు కల్పనఁ జేసిన వాక్కువెంట న
ర్థము పరువెత్తు నన్యులకుఁ దద్విపరీతము మీరెఱుంగరే.

క॥ పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
మచ్చిక పోనాడివేయు మాన్యున కగునే !
కచ్చెకుఁ గాలును దువ్వెద
విచ్చుట నన్నెమి నేము నితఁ డనిగాదే.

సీ॥ నిఖిలహేయప్రత్యనీకకళ్యాణైక
తానుఁ డానందవిజ్ఞానమయుఁడు
స్వాభావికాధికజ్ఞానబలైశ్వర్య
వీర్యశక్త్యాదికావేలగుణుఁడు

నిత్యనిరతిశయనిరవద్యదివ్యాద్భు
తౌజ్వల్యసౌందర్యయౌవనుండు
స్వానురూపాచింత్యశక్త్యసంఖ్యేయ క
ల్యాణనిర్దోషదివ్యాయుధుండు

గీ॥ స్వాభిమతయోగ్యరూపస్వభావవిభవ
ప్రభృతికల్యాణగుణరమావల్లభుండు
అఖిలజగదుదయవిభవహారణలీలుఁ
డా పరబ్రహ్మ నామనారాయణుండు

గీ॥ అట్టి పరమాత్మ నేత్రాల కకట హేయ
సామ్యమును జెప్పి తీవేమి సాధువనుచు
నొడలు తెలియని యావేళ మొదవ నచట
నీ విధంబుగ వాని నే నీసడింప.

ఉ॥ అంతట నాతఁడయ్యె ప్రళయార్కు విధంబునఁ జూడనొప్పి దు
ర్ధాంత మహాగ్రహంబున మహత్తరశాప మొసంగె నిట్లు లో
కాంత! కలామదంబ యిదిగాదె యపృచ్ఛపుభాషణంబె నీ
కింతకుఁ దెచ్చె గాన హృదయేశుఁడు నిన్విడనాడుఁబొమ్మనన్.

చ॥ అతని కఠోరశాపమునకంత లవిత్రనికృత్తవల్లికా
గతినిఁ దదీయదివ్యపదకంజములంబడి లోచనాంతని
ర్గత జలధార లేఱులనఁగా బ్రవహింపఁగ గద్గదస్వనా
వతగళసూక్తిరీతి నిటుగా బతిమాలితి నో మహాశయా !

ఉ॥ స్వామి క్షమింపు మీవచన చాపల మింత మహాగ్రహంబు నా
పై మదిఁబూనితీవు తగవా? భరియింతునె? మీరు గొప్ప వి

ద్యామధురాత్ములంచు బదులాడితిఁగాని జిగీషతోడఁ గా
దో! మహనీయశీల! దయతో దిలకింపుము నీకు మ్రొక్కెదన్.

ఉ॥ పువ్వులలోఁ బరిమళముపోల్కి వియోగము లేని మమ్ము నీ
వివ్విధి వేఱుసేయఁదగునే మహనీయ దయాస్వభావ! నా
జవ్వనమందు జవ్వికను సర్వము నేఁటికి దీఱిపోయెనే?
యెవ్వఁడు మేలుసూచి సహించును వాఁడెగదా మహాత్ముఁడా.

కం॥ పోనీ నానుడి ప్రత్యా
ఖ్యానం బొనరించి నీవు కాదనరాదో
జ్ఞానివి యీవిధి శాపా
ధీనులఁగాఁ జేయఁదగునె ధీరుఁడ మమ్మున్.

ఉ॥ ఆ విభుమోము నేను క్షణమైనను జూడక నిల్వఁజాల న
య్యా! విమలానుభావ! యిటులాడుట ధర్మమె? యేమితప్పు నా
పై విధియించి శాపమిడవచ్చితి వీవు దురాగ్రహంబ కా
దే? వనితాభవంబున నిదేయగు నీకని యింటికేగితిన్.

ఉ॥ అంతటఁ గొన్నినాళ్ల కిటులయ్యె మహాశయ! నా యవస్థ హృ
త్కాంతునితో వియోగమది దాపురమయ్యె నిఁకేమిసేతు గే
హాంతర సీమయందు వసహాయత నొంటరి నుండలేక దే
శాంతర మిట్లు రావలసె నయ్యె క్రమంబుగఁ దేవనంబునన్.

చ॥ అని విరమింప నా సతి తదాశ్రమవాసి రొకింతసేపు దృ
ష్టికి బయికెత్తిపట్టి భ్రుకుటీన్ నొసటన్ ఘటియించి చూచి నె
మ్మనమునకేదొ తోప స్మితమాధురి దెల్పెడు సూక్తితోడ మె
ల్లన నిటువల్కె గౌరవపురస్సర వైఖరి నో మనస్విని!

ఉ॥ ఎన్నడురాని సద్విదుషి విప్వ్రధివచ్చుట నాశ్రిమాయుభా
గ్యోన్నతి నేమిచెప్పుదు నహో! భవదీక్షణభాషణాదిసం
పన్నత నస్మదాదులును పావనులైరిసుమీ! వరానుకూల్య మిం
దున్నది కొద్దికాల మెద నోపికఁబట్టుము నీకు మేలగున్

మ॥ అవలోకింతువు నాథు నిక్కమిట నీవందాక నోసాధ్వి మా
సవిధంబందు వసింపుమీ! యిటకు శాస్త్రిశాస్త్రవాదార్థులై
కవులున్ బండితులున్ దదన్యులగు ప్రజ్ఞావంతులున్ శారదా
నవరాత్ర్యుత్సవమందుఁ జేరుదురు నానాదేశనిర్యాతులై.

గీ॥ భారతీనవరాత్ర్యుత్సవంబుదాఁక
నస్మదాతిథ్యసత్కార మందవలయు
నీర లన నామె మారుమాటేమి లేక
చేర వెనువెంట వానికుటీరమునకు.

మ॥ అనయంబున్ బరమేశ్వరీచరణనిధ్యానానురాగక్రియా
జనితశ్రీమదుదారభావకవితాసాహిత్యసాహిత్యనూ
తనమార్గంబున నెల్లలోకుల కమందానందముం గూర్చు నీ
ఘనమేధాబల మప్రతర్క్యము నమస్కారార్హమో సత్కవీ!

ఇది

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్య ప్రణీత
విద్యావిలాస ప్రబంధ
తురీయోల్లాసము



శ్రీ హయగ్రీవ స్సహాయః

# విద్యావిలాసము



## పంచమోల్లాసము



క॥ శ్రీతతచిట్టాప్రెగ్గడ
భూతలగణనీయవంశముక్తాఫలతా
రీతీగేయ! శుభాశయ!
సీతారామాంజనేయ! చిన్మయకాయా!

ఉ॥ శ్రావణశుక్రవారమది చల్లనిసాయము వేళఁ గేతకీ
శ్రీవిలసిల్లు వాలుజడ రేగిన కమ్మని తావి రాజవీ
థీవితతప్రదేశముల దిగ్భ్రమ సేయుచుఁ బేరటాండ్రతోఁ
బోవుచునుండె "ఇందు" రతిపోలె నపూర్వపు రూపసంపదన్.

ఉ॥ తామర రేకులో యను విధాన విరాజిలు లోచనాలు వి
ద్యామద మాభిజాత్య మఖిలాగమవిజ్ఞత సూపుచుండ నా
కోమలివంక నిస్పృహులుఁగూడ నిమేషము పాఱఁజూచి వా
ణీమధురావతారమని నేత్రనమస్కృతిఁ జేసి రాత్మలోన్.

ఉ॥ శ్రావణశుక్రవారవరలక్ష్మీవ్రతమ్మవలెన్ నిగమాగ్రహారభూ
దైవచిరంటికాగృహాంగణంబులఁ బోవుచునున్న యిందిరా
దేవిని జూచి జ్ఞాని యను దృష్టినొకింత మరల్పలేక యే
దో విపరీతమున్న దిటులుండున యీమానవకాంతమైనచోన్.

సీ॥ గజ్జెలొడ్డాణంబు కళలీను కటిమీఁద
మొగలిమొగ్గల జడ ముద్దులొలుక
కుండలప్రభలతోఁ గులుకు చెక్కులమీఁదఁ
జిఱుచందనపుఁబూత సిరులు గురియ
కదులు ముంగురులచేఁ గదుముఫాలముమీఁదఁ
గొన్ని కుంకుమబొట్లు వన్నెలీన
కమ్రనూపురకాంతిగల పదంబులమీఁద
నవ్యలాక్షారేఖ నటన సలుప

గీ॥ కట్టుకొనియున్న పట్టుబంగారు జరిగ
పయిఁటపావడ మేని విభ్రమముఁ దెలుప
గురుకులాశ్రమసన్నిధి సరణినుండి
ఇందిరాదేవి మెలమెల్ల నేగుచుండ.

ఉ॥ ఆ సమయంబులో గురుకులాశ్రమ శాస్త్రవితర్దికావ్రదే
శాసనుఁడై విలాసుఁడు మహాత్ములుకొందఱు కూరుచుండ నా
వ్యాసుని బ్రహ్మసూత్రములభావ మెఱింగినవాఁడు శంకరుం
డే! సరియైనవాదమదియేయని వారికిఁ జెప్పుచుండగన్.

శా॥ ఆవాదంబును సావధానముగఁ దా నాలించి నాప్రేమలీ
లావిర్భావహరుం డితండని యనూయం జెంది యొక్కింత సే

షావీథిస్థలి నట్టె నిల్చి కనె, మాయావాదరాద్ధాంతవి
ద్యావైశద్యనిరాకృతాన్యమతతత్త్వాంశుఁడా విలాసాఖ్యునిన్.

శా॥ ఆరీతిన్ బరికించి వీనికడ విద్యాశక్తిఁజూపింపకేఁ
బోరాదంచుఁదలంచి వేగగతిఁ దాఁ బోయెన్ విలాసాఖ్య వి
ద్యారాజీవజునన్నిధానమున కౌరా ! యంచు వెంటన్ జిరం
టీ రత్నంబులు తోఁగిక్కులాడి సభయౌన్మాహాత్ములన్ నిల్వగన్.

శా॥ ఆకన్యాగతియందు భావమది యేమైయుండునా యంచు నా
యీ కూర్చుండిన పెద్దలందఱద నేమోమో మహామోజనా
లోకవ్రిక్రియ నుందునంతఁ బిలిచెన్ లోలాక్షి వాణీవివం
చీకమ్రిస్వరముగ్ధకంఠమున సుశ్రీకున్ విలాసాఖ్యునిన్.

శా॥ స్వామీ! వ్యాసునిబ్రహ్మసూత్రముల భావంబంచుమీరేదో మే
ధామాహాత్మ్యముమీఱ నిప్పుడొకరాద్ధాంతంబునూచించినా
రేమేమీ! మఱియొక్కసారి చెపుడిస్సీ! యేమిపాండిత్య మే
మీ మాయామతవాదలో భ"మయమాత్మాబ్రహ్మమే"సత్యమా

శా॥ జీవబ్రహ్మము లైక్యమొందునని మీసిద్ధాంత మేపాటిదే
దీ వాచింపుము బ్రహ్మసూత్రముల కేనే కర్తనన్నట్టు లే
మో! వాదించెద వెట్టు"తత్త్వమసి" యొక్కో"నేహనానాస్తి"యా
భావింపన్ మఱి"సోఽహమస్మి"యను"సర్వంఖల్విదంబ్రహ్మ"మా?

ఉ॥ వ్యాసుఁడుబ్రహ్మసూత్రములువ్రాసినమీఁదఁ బురాణజాలమున్
జేసెనుగాదె వానియెడ స్వీయమహత్తరసూత్రతత్త్వ మే
దో! నవరించి చెప్పె నదిగో! పరికింపుము నారదీయ మీ
జానటమైన "తత్త్వమసి" వాక్యము నెట్టు పరిష్కరించెనో!

గీ॥ తత్త్వమస్యాదివాక్యసిద్ధాంతమునకు
జీవపరమాత్మభేదంబు జెప్పరాదొ?
అరయ నీ బంధ మవల నీయాత్మమాత్రి
మా పరబ్రహ్మసాదృశ్యమందకున్నె ?

గీ॥ బ్రహ్మమే జీవుడను పేరఁ బరఁగెనేని
ముక్తిని గుఱించి జీవుండు మ్రొక్కనేల
జ్ఞానరూపాత్మబ్రహ్మకజ్ఞానమొకవ
నద్ది మాన్పఁగ నెవఁడు సమర్థుడయ్య!

చ॥ అరయ మహానుభావుఁడగు వ్యాసుఁడు పోయిన బ్రహ్మభావనా
గరిమను వృద్ధిచేయుటకుగా మదినెంచుచు బ్రహ్మసూత్రము
ల్విరచనసేయ "తత్వమసి" వెఱ్ఱికి లొంగి ప్రపంచమున్ నిరీ
శ్వరమొనరింతురే! మఱుగుబౌద్ధమతంబిది కాదె? విజ్ఞుడా!

మ॥ ఒకబంగారపుముక్క రెండయిన నీందున్నట్టి ధర్మంబు లా
శకలాలందు స్ఫురింపకున్నె? తమపక్షంబందు జీవుండుగా
వికటించెన్ బరమాత్మయన్న నపుడేదీ చెప్పుమా! సచ్చిదా
త్మకతద్బ్రహ్మవిలాస మిర్వురకభేదప్రౌఢిఁ బాటించినన్.

తత్త్వమస్యాది వాక్యోత్థం యజ్జీవపరయాత్మనోః
సాదృశ్యవిషయం జ్ఞానం తదేతన్మోక్షసాధనం.
(బృహన్నారదీయము)

భిదా యది నసిద్ధ్యేత జీవాత్మపరమాత్మనోః
తదా ముక్తౌ విమోక్షాయ కోయత్నం కర్తుమర్హతి.
జ్ఞానరూపం పరంబ్రహ్మ తన్నివృత్త్యం మృషాత్మకం
అజ్ఞానం చేత్తిరస్కుర్యాత్ కఃప్రభుస్తన్నివర్తనే.

మ॥ ప్రతిజీవుండును దుఃఖమందుటది యేలా! శాశ్వతానంద సం
గతిఁ దా నెందులకందరాదు తమపక్షంబందు బ్రహ్మంబు సం
తతమున్ జచ్చుచుఁ బుట్టుచుండు నని కాదా! కాదు మాయాసమా
వృతియే బ్రహ్మకు మూలహేతువనియా విజ్ఞుండ! నీ వాదముల్.

శా॥ మాయాశబ్దవిమర్శ సేయు నెడఁ 'యా మా సా హి - మాయా' యటం
చోయీ! కాదె! వచింతు రీవిబుధులో హో లేనియద్దానిచే
నీయీ నిర్గుణవస్తు వెట్టు వశమయ్యెం జెప్పుమా! యిప్పుడో
మాయావాది! యనంగ నాతఁ డెద నేమాధార్ష్ట్యమం చీసునన్.

శా॥ బాలా! చాలిఁక నాపు మంతట భవద్వ్యాదోరువాచాలతా
లీలాప్రౌఢికి సంతసించితిమి లే శ్రీశంకరాద్వైతవి
ద్యాలావణ్యము పూర్వపక్షమను మేధాస్ఫూర్తి నీకుండెఁగా
బోలుఁ గ్రమ్మఁటఁ గూరుచుండుమది యేమో? కొంచెమాలించెదన్.

చ॥ అరయఁగఁ బూర్వజన్మకలితాచ్ఛతపస్సుకృతానువాసనా
గరిమము లేకయున్న, సరిగా నవగాహముగాని యిట్టిశం
కరుని మతంబు దానివయి ఖండన సేయ నుపక్రమించితీ
వర రే! యిదెల్ల శైశవవయశ్చపలత్వముగాదె? బాలికా!

మ॥ జగమెల్లన్ బరమాత్మదేహ మగుచో స్థాయజ్జగన్నిష్ఠహే
యగుణంబుల్ గలవా క్ష్మాయీశ్వరుని దేహంబందు మీ యుక్తిలో
సగుణబ్రహ్మశరీరమున్ జగము నా సత్యంబు బాలా! నశిం
చుఁగదా లోకము నిత్యమందు వెటులో చూపింపుమా శాస్త్రమున్

చ॥ అరయన్ వ్యాసుని బ్రహ్మసూత్రములలో నద్వైతతత్త్వంబు శం
కరుఁడే రీతి వచించెఁ జెప్పుమని యే కాసీదు వాగ్వాద వై

ఖరి చౌలామణి! "నేతినేతి" శ్రుతివాక్యమ్మొక్కటే చాలులోఁ
బరిశీలింపుము వెఱ్ఱిపోకడల లాభంబుండునే మాయెడన్.

చ॥ ఒకశ్రుతి "ద్వాసువర్ణ" యనుచున్నది చూపెదవేమొ వ్యావహా
రికదశనొప్పు వేదవిపరీతసమన్వయమీయదంచు నీ
వికఁ వచియింపఁబోయిన నదేమియు సాగ దుపాధి, మాయ, బ్ర
హ్మకుఁబరిణామహేతువులుమాటలు పెంచకు మన్ననామెయిన్.

గీ॥ ఎండమావులనీటిలో నీఁదులాడి
మేఘపుష్పంబులను దలమీఁద ముడిచి
చిన్నికుందేటి కొమ్మును జేతఁబట్టి
నడచె గొడ్రాలికొడుకన నమ్మఁగలవె

గీ॥ ఉపనిషద్వాక్యములలోన నుండెనొక్క
మీరలను, మాయ, భ్రమ, వ్యావహారికంబు
నిర్విశేషము, సవిశేష నిర్గుణములు
భేదమివియెల్ల శ్రుతులఁగల్పింపకున్న.

క॥ నిత్యోనిత్యానామను
సత్యశ్రుతి జీవుజాడఁ జాటుట లేదా!
గత్యాగత్యుత్క్రాంతుల
నిత్యాదిశ్రుతులకర్థమేమో, చెపుమా!

క॥ శ్రోతా ద్రష్టామంతా
ఘ్రాతా, బోద్ధా, చిదాత్మ కర్తా, పురుషః
ఏతాదృశశ్రుతినరయఁగ
"నేతావత" తేలినట్టిదేమో, కనుమా!

క॥ "అస్మాల్లోకాత్ప్రేత్య
త్యస్మైలోకాయ కర్మ" యనియెడు శ్రుతిచే
విస్మయమొదవును నీవలు
కస్మాదృక్తికి జీవుఁడౌనా కాదా.

క॥ "అపహతపాప్మా విజరో
వ్యపిపాసస్సత్యకామ" యనియెడు శ్రుతిచే
చెపుమా! నారాయణుఁడని
విపరీతపువాదమింక విడుము వివాదీ!

క॥ "ఏకో నారాయణుఁ" డను
చేక గ్రీవముగఁ జెప్పె నెపుడో శ్రుతులున్
నీకా వాదనమేటికి
శ్రీకాంతుఁడె బ్రహ్మ మదియె సిద్ధాంతమునూ.

క॥ జగదుత్పత్తి స్థితిలయ
సుగమం బజ్ఞానగంధశూన్యము నానా
సుగుణము నారాయణ నా
మగదితమిాబ్రహ్మసగుణమయ్యా మహాత్మా.

శా॥ ఈరీతిన్ స్వమతాభిమానములతోనే బ్రహ్మసూత్రార్థచ
ర్చారాద్ధాంతవిమర్శనప్రకటితేర్ష్యాభావనిర్వ్యాతదు
ర్వారోదారవచఃప్రసంగకలనావ్యాపారపాండిత్యరే
ఖారాజన్మతులౌచువారు జయదీక్షన్ బోరుచున్నంతలోన్.

ఉ॥ ఆ నిగమాగ్రహారపురమందలి కొందఱు పెద్దవారు వి
జ్ఞానులు బ్రహ్మవేత్తలు నిశాసమయంబు నిశీథవాటచేన్

మానుఁడు వాదమిప్పటికి మానితభావనులార! రేపు శారదా
స్థానమునన్ విచారణముసల్పఁగనౌనని వారి నాపినన్.

ఉ॥ ఆమఱునాఁడు తద్గురుకులాశ్రమమందు సరస్వతీగృహా
రామములోన వెండి మొదలెత్తిరి శాస్త్రవివాదమంత బా
లామణి యామహాత్ముఁడు విలాసుఁడు దివ్యసరస్వతీకర
శ్రీమృదుకంకణక్వణవిశేషఘులంఘులముగ్ధవాగ్విధిన్.

కం॥ భగవద్గీతావిషయము
సగమయ్యెను నాఁటివారిచర్చావిధులన్
బగదీఱకమఱునాఁడును
బిగిగల జయదీక్ష మొదలుపెట్టిరి దానిన్.

గీ॥ నిర్విశేషశుద్ధ నిత్యచైతన్యాత్మ
కలన విహతజీవకలుషుఁడైన
కృష్ణుఁడెట్టుమరల నేనునీవనుభ్రాంతి
వడసె గీతయందు వాది! చెపుమ

గీ॥ అధిగతాద్వైతవిజ్ఞానుఁడైన పరమ
పురుషునకు దగ్ధవస్త్రంబువోలె బాధి
తానువృత్తిస్వరూప భేదానుభూతి
బంధకము గాదటంచు నా వాదివలికె.

మ॥ అకటా! యెవ్వఁడు నేర్చెనీజటిలమాయావాదసిద్ధాంతదు
స్త్రపాండిత్యము నొక్కఁడు మృగతృష్ణన్ జూచి నీరంచుద
గ్గఱకుం బోయి నిజంబెఱింగి మఱలన్ గానీ పునస్తద్భ్రమం
బరయన్ గల్గినఁ దజ్జలాహరణ కార్యంబందు వర్తించునే.

క॥ ఆ రీతిగ నద్వైతో
దార జ్ఞానంబు చేతఁదఱిఁగిన భేదా
చారము మరలన్ వచ్చిన
నారీ! యుపదేశ వృత్తి శూన్యముగాదే?

క. విదుషీ! యెఱుఁగవు నామత
మెదియో ప్రాగ్జ్ఞుఁడైన యీశుండొటన్
విదితాగమ తత్త్వాంశుం
డిదియే సుమి బాధితానువృత్తియనంగన్.

క. "వేదా హంసమతీతా
న్యాది" శ్లోకములకెటు సమన్వయమయ్యా!
వాదీ "యస్సర్వజ్ఞుఁడు"
గాదే? పరమాత్మ యేమికల్పన మరరే?

గీ॥ అద్వితీయాత్మరూప సత్యంబుగలిగి
భేదమనువర్తమానమై వెలయువేళ
అద్వితీయాత్మవిజ్ఞాన మప్పుడెవరి
కీరలుపదేశ మొనరింతు రేది చెపుమ!

క॥ ఏమీ చెప్పుటకొప్పదె
భామిని! ప్రతిబింబమనఁగఁబరఁగెడు కుంతీ
రామామణితనయునకను
చేమో మతిపోయె నీకు నెఱుఁగవు వాదిన్

క॥ ఏమీ! మతిపోవుట నీ
కా! మఱినాకా! వచింపుమయ్య యెవఁడేన్

ఈమహీ దర్పణమున్యాసి
సీమా ప్రతిబింబములకుఁ జెప్పనెహితముల్

కం॥ అనాఁడిట్లుగతించెను
కానీ మఱునాఁడుకూడ గలిసిరి నానా
నూనవివాదకు బ్రహ్మ
జ్ఞానప్రాధాన్యపిశునచర్చావిధులన్

క॥ ఇదియొక గీతాశ్లోకము
చదువఁగనంబడును బ్రహ్మచైతన్యంబే
సదసద్భిన్నము మత్పర
మదియును మొదలేమిలేనిదనియే విదుషీ!

క॥ అరయఁగ మూర్త మమూర్తము
పురుషుఁడ! సదసత్తులనుచు మూర్తామూర్తే
తరమగు బ్రహ్మములేదని
విరచించెను వ్యాసుఁడిట్లు వింటేయొకచోన్

శా॥ వాచావాచివిహారసంభృతరణాస్వాదానువాదక్రియా
ప్రాచుర్యంబున వారలిర్వురిటులారంభించిరాబ్రహ్మవి
ద్యాచర్చన్ గతియించె మాస మెదిసిద్ధాంతంబుగాకన్న నే
మా చోద్యంబనిచూడవచ్చిరి సమస్తాశావ్రసిద్ధజ్ఞులున్

సీ॥ కాశీపురమునుండి కదలె మహామహో
పాధ్యాయబిరుదవిద్వద్గణంబు
"వానమామల'నుండి వచ్చె శ్రీయుత విశి
ష్టాద్వైతపీఠసంస్థాపకుండు

"శృంగేరి'పురినుండి చేరె వాణీపీఠి
కాద్వైతవిద్యామహార్థవేది
నాల్గుదిక్కులనుండి నడచె నానాశాస్త్ర
భట్టారకాచార్యభట్టసమితి

గీ॥ గురుకులాశ్రమశారదాచరణదేశ
కలితబాలావిలాసదుష్కరవివాద
వివిధవేదాంతసిద్ధాంతవిషయమెల్లఁ
గనఁగ శిష్యోపశిష్యసంఘములతోడ.

క॥ యావద్భారత బుధగణ
మీవాదము నాలకించి యెటు చెప్పుటకున్
దోవ నెఱుంగక మదిలో
"దేవానాంప్రియుల" రీతి తికమకపడియెన్.

శా॥ మీమాంసాయుగళీవిమర్శనము లామీఁదన్ మహాఋగ్యజు
స్సామాథర్వణవేదవాఙ్మయసమీక్షాచర్చలున్ శాస్త్రవి
ద్యామేయప్రతిభాప్రదర్శనములాహా! వారి వేదాంతగో
ష్ఠీమర్యాద నతిక్రమింపకయె మించెన్ సభ్యులుప్పొంగఁగన్.

గీ॥ ఈవిధంబుగ వాగ్వాద మిద్ధరకును
జరుగుచుండఁగ గురుకులాశ్రమమునందు
శారదాదేవి నవరాత్రిసంబరంపు
ప్రౌఢసన్నాహమంత నారంభమయ్యె.

క॥ ఎక్కడివిద్వద్బాధవుఁ
లెక్కడి వేదాంతు లెక్కడెక్కడిబుధు లిం

కెక్కడి విదుషీరత్నము
లక్కడఁ గాన్పింప నమితహర్షమెలర్పన్.

శా॥ యావద్భారతదేశముఖ్యవిబుధుం డధ్యక్షుఁడై యుండ వా
గ్దేవీసాక్ష్యముగాఁ దదాశ్రిమమిళద్ధీమత్సభారంగవే
దీవాబాహవపీఠి నిల్వఁబడి మృద్వీకామరందాభవా
చావైశిష్ట్యముమీఱ నా విదుషి సౌజన్యంబుతో నిట్లనెన్

శా॥ నానాదేశసమాగతప్రథితవిజ్ఞానప్రభావాఢ్యులా
రా! నావాదము నాలకించితిరిగాదా! యేదిసిద్ధాంత మీ
రే నిర్ధారణసేసి చెప్పుడిఁక మీకేలా యిట్టితాటస్థ్య చే
ష్టానైర్భర్యము నూనఁగా నుభయచర్చల్ లో విమర్శింపుఁడీ

సీ॥ వేదదాతయు వేదవేద్యంబు సర్వజ్ఞ
మానందమయము సూర్యాదిసకల
తేజఃపదార్థవిరాజకం బజ్ఞాన
గంధరహితము నిర్గతవికార
మఖిలజీవవిచారహంత ముక్తివిధాత
నిఖిలశక్తియుతంబు నిత్యశుద్ధ
బుద్ధముక్తస్వభావేత్థంబు జగదుద
యస్థితిలయహేతువై స్వయంప్ర

కాశమానంబునౌ బ్రహ్మ కలదుగాదె
వ్యాసవిరచితసూత్రతత్త్వంబునందు
సకలశ్రుతులందు నుపనిషత్సరణియందు
న్యాయదష్టాదశపురాణజాలమందు

క॥ కావునఁ దత్త్వంబెఱిఁగిన భావజ్ఞులు నుభయభాష్యవచశోధకులై
ట్లీవిధిఁ జెప్పిన నాపై గావింపరుగాదె కోపకలితమనీష౯

క॥ ఆకన్యోపన్యాసము నాకర్ణించిన విలాసుఁడంతట వనియెన్
బ్రాకటవేదాంతార్థ శ్రీకరవాచావిశేషరీతి౯ సభలోన్.

శా॥ నావాదంబున కెన్ని ప్రశ్నలను గన్యారత్న మే వేవియో
కావించె౯ మఱి వానిఁ బూర్వమె తిరస్కారంబుఁ దాఁ జేసె నా
యావిజ్ఞావళి, దానికోసమిఁకఁ గయ్యంబేలమాకిప్డు జే
దీ వాచింపుము మీర దేమియున నేనే కొంత చర్చించెద౯.

క॥ కానీ! నేఁటికి మాసంబైనను మావాదతత్త్వమరయుండొకఁడేన్
గానన్ మాభాష్యంబుల వాణీపదసీమ నుంపవలయునుసుండీ.

క॥ ఆరయ ఋషులును వేదము శ్రీరామాద్యవనిపులును జెలఁగిన శ్రీమ
ద్భారతఖండమునందున శారద సాక్షాత్కరించి సాక్ష్యంబిడదే?

గీ॥ శారదాదేవి సన్నిధిస్థలమునందు
స్వామి శంకర రామానుజప్రణీత
భాష్యయుగళంబునుంచిన వానిలోని
తత్త్వ మప్పుడు దెలియంగవచ్చుననుచు.

గీ॥ అంత విద్యావిలాసుండు నా కుమారి
స్వమతసిద్ధాంతయోగ్యభాష్యములఁ దెచ్చి
శ్రీగిరాందేవి పాదాలచెంత నునిచి
ప్రస్తుతించిరి భక్తివశంవదోక్తి.

దండకః॥ కలయ జనని, వందారుబృందారకశ్రేయసీ
బృందధమ్మిల్లమందారమాలాచ్యుతా మందమారంద ధారాసుధా

# విద్యావిలాసము

బిందుసందోహసౌరభ్యసౌలభ్యలో భాగతేందిందిరస్తోమఝంకార వాచాలితాంఘ్రిద్వయీరత్నశింజానమంజీరభూషే! సుధాపేయభాషే! రిపుప్రౌఢరోషే! స్వతశ్శుద్ధవేషే! శరత్కాలకల్యాతపస్ఫూర్తి విస్ఫారితాంభోరుహస్పర్ధిదివ్యాననాంకూరితస్మేరరేఖావిలాసప్రభాధూతభక్తోత్కరాజ్ఞానగాఢాంధకారే! లసద్రత్నహారే! త్రయీవాగ్విహారే! కృపాసింధుపూరే! నమద్దేవవారే! మృదుక్వాణవీణాసుధాగానసంతోషితాశేషజీవే! శ్రితత్రాణభావే! చలత్కుండలాకీర్ణనానామణీచిత్రరోచిఃపరీవాహదీవ్యత్కపోలే! త్రయీగానలోలే! మనోహారిఫాలే! కవిస్తవ్యశీలే! శిరోలగ్నకోటీరకోటీసమాటీకమానోరురత్న ప్రభాపుంజకిమ్మీరితాశే! సుహృద్దీపితాశే! నతాశీర్విశేషే! ఖిలోద్యన్నిదేశే! నమస్తే నమస్తే నమః.

ఉ॥ ఒకటిసీమలోలభుజగోపమకోమలనీలవేణి! గం
గాకమనీయపంకరుహకంకణశీతలవాతచుంబిత
శ్రీకరవల్లకీగుణపరిచయభాసురపాణి! సౌధధా
రాకరవాణి! వాణి! కృపయా పరిపాలయ మాం నమోఽస్తు తే.

ఉ॥ శారద పుండరీకదళసౌభగహారివిశాలనేత్రి! రా
కారజనీప్రియామలవికాసమనోహరమందహాసరే
ఖారుచిరాస్య నమ్రసురకంజముఖీకబరీవరీముఖా
సారజడీకృతాంఘ్రియుగ శారద! పాలయమాం నమోస్తు తే

క॥ యావద్భారతవిద్యాభావజ్ఞులు మెచ్చ నాదువాదము నిలుపన్
దేవి! సరస్వతి! కరుణాపావనదృగ్దీప్తిఁ దెలియుటల్కాదు కాదే?

శా॥ ఆనిష్ఠన్ స్తుతియించి వారపుడు సాష్టాంగప్రణామక్రియా
ధ్యానంబున్ ముగియించి పిమ్మట మహాశాంతిన్ మేమాత్మీవి
ఛానైర్భర్యము మీరనుండు నెడ "సాక్షాదేవ సర్వాంతరా
త్మా నారాయణ ఏక ఏవ పరమాత్మా!" యన్న శ్రీసూక్తితోన్.

సీ॥ శతకోటిరవిరుచిస్ఫురద్రాళిమకుటంబు
శీర్షభాగమున సుశ్రీ సెలంగ
హారహీరతుషారసారనీహారాంశు
ధవళవస్త్రంబు గాత్రమున మెఱయ
గాంగానిలాంకూరకలితసప్తస్వర
స్తవనీయవీణ హస్తమునఁ గులుక
స్ఫటికాక్షమాలికాసరసీజశుకశోశ
నవకాంతి నాల్గుబాహువుల వలర

గీ॥ ఆశిలాహూవవైవర్ణ్యమంతరింప
వాణి సాక్షాత్కరించి చేపట్టికొనియె
నుభయభావ్యంబు లందులో నొకటిమాత్ర
మెత్తి, శిరము నధరియించె నేమికతమొ ?

ఉ॥ ఆరమణీయదృశ్య విషయంబున కచ్చటనున్న తత్సభా
స్తారులు విస్మయాకులవిశాలవిలోచనదృష్టిఁ జూడ నా
చేరువనున్న యొక్కసతి శ్రీలుసెలంగెడు వాక్కుతోడ హం
సీరమణీయానమునఁ జేరెఁ దదంగన రత్నగర్భయే.

గీ॥ ఆవిధంబుగ వారిడాయంగఁ బోయి
సభికులందరితోడ నీ సరణిఁ బలికె

వక్త్రద్రాక్షాగుళుచ్ఛనిష్యందమాధు
రీమలిమ్లుచసూక్తిపరిచయాప్తి.

ఉ॥ ధారణి పుణ్యభూమియని తద్దయుఁ బేరుగణించుకొన్న బం
గారమువంటి యీ భరతఖండమునందు జనించియుంటనో
సూరివరేణ్యులార! యిది చూచి కృతార్థత నందఁగల్గిరీ
రారయ, నీకథావిషయమందలి తత్త్వము నాలకింపుఁడీ!

క॥ ఆరయ శ్రీభాష్యంబును
శారద తలమీఁదఁదాల్చి చాటెన్ ఏకో
నారాయణుఁడను తత్త్వము
కారణమేమనఁగ మున్నొకానొక వేళన్.

గీ॥ శారదాంబకు బ్రహ్మకు జరిగెవాద
మీ విధాన వరబ్రహ్మమెద్దియనుచుఁ
గడకు విసుఁగెత్తి ధాత వాగ్వాదజనిత
నిర్భరావేశగరిమ వాణిని శపించె.

ఉ॥ ఈమెయె యామె, శాపఫలమిప్పటికయ్యె సమాప్తి, బ్రహ్మవి
ద్యామహనీయులార! విషయంబు మఱొక్కటి, శారదాంబ తా
నేమొ ధరించె, భాష్యమిది యేటికనన్, దనవాదమద్ది కా
నీ! మును రెండు భాష్యములనెత్తి కరంబున గంటికద్దదే!

మ॥ ఇఁక, వీరిద్దఱు శ్రీవరాత్పరులు వారే తత్స్నుషాపుత్రి వా
దకథార్భాటము నాలకించి యిటుగాఁ దామైరి యన్నంతలో
నికటప్రాంతమునన్ హఠాద్గతిని వాణీబ్రహ్మలన్వర్థకా
ఖ్యకులై లేచిరి స్వస్వరూపములతో నాకాశమార్గంబునన్.

ఉ॥ ఆ విషయానుభూతిఁ గలయా యిది, లేక నిజంబ యంచు చిం
తావిలుఁడైన వాని శ్రవణాంతరసీమకు హాయిఁగొల్పె నా
నావిధదివ్యగానపరిణామరణన్మహతీనినాదసం
పావితభార్గవీరమణచారుచరిత్రవిశేషగేయముల్

ఉ॥ ఆమహతీనినాదమునకంత విలాసునితండ్రి లోన నెం
తో ! ముద మొంది మౌళిఁ గరతోయరుహాంజలిఁగీలుకొల్పి వీ
ణాముని నారదుండు హరినామనిరంతరచింతనక్రియా
శ్రీమహితాత్ముఁడై, యవతరించి తదర్చితపాదపద్ముఁడై.

ఉ॥ ఓ మహనీయశీల ! విబుధోత్తమ ! త్వజ్జననాంతరాత్తవి
ద్యామహనీయసౌభగమహా ! యిఁకనేమనవచ్చు ధీమతీ
రామకళత్రమాటయు సరస్వతి సన్నిధినుంట నావరం
ధాముఁడు పుత్రుఁడౌటనన దర్శనమిచ్చిరి వారలట్లుగాన్

ఉ॥ ఆ రమణీయసంఘటనకంత మహాత్ముఁడతండు భక్తిసం
పారఁగ విస్మృతాన్యవిషయస్పృహుఁడై దరఘుంఘుమస్వనో
దారగభీరకంఠనినదంబున నిట్లు స్తుతింపసాగె శ్రీ
భూరమణీమణీహృదయమోహను భక్తజనామరద్రుమున్

క॥ జయ, జయ, శ్రీ భూదేవీ నయనేందీవరవిలోలనానాపాంగో
దయసుశ్యామలశోభామయనవశతకోటిమదనమధురశరీరా !

క॥ జయ,జయ,నతజనచేత
స్సమయహారమకుటప్రభాఢ్యచలదలకాఢ్యా
శ్రీయఫాలోజ్జ్వలమృగమద
మయనవచిత్రకవిశేషమంజుముఖాబ్జా !

క॥ గిరివాలంబసుమణిహారావళిసంకీర్ణ వైజయంతీమాలా
పావనసౌరభమోహితదేవాసురరత్నమకుటదీపితచరణా !

క॥ శ్రీరమణీమణిపదలాక్షారసరేఖావిలాససంస్తవగుణిత
శ్రీరంజితోరుకౌస్తుభచారూరశ్శ్యబలితార్ద్రచందనచర్చా !

క॥ శ్రీపుమప్పన్మయేక్షణదీపితవీక్షావిభాని దేశస్ఫుటనా
భీవంకజార్ధముకుళనవేపితవాణీసరోజపీఠవిహారా !

శ్లో॥ రమాచరణరక్తశ్రీద్విరావృత్తాభకౌస్తుభం
శరణం జగతాంనాథ మభయాయ వృణీమహే

శ్లో॥ దివ్యాగమవరిలాల్యేనతపాలకనిచయహరణపటుదీక్షే
తావకపదారవిందేవినమతమాళిస్సదావందే.

శ్లో॥ జరయతు విపదో దదాతు భక్తిం
దలయతు చండకరోగ్రతాపబాధాః
గమయతు సుఖమార్గసన్నివేశా
విహరతు మే హృది సన్నివేశాః.

శ్లో॥ దదాతు నవనీరదోపమశరీరకాంత్యుత్కరై
ర్వృథాళి భుజగాశనానతితరాం శ్రితాన్నాటయన్
సమిద్ధమృదుమల్లికాసుమసుధాంశుహీరప్రభా
ప్రభూష్ణురుచిరస్మితస్థిరశుభాని సర్వేశ్వరః.

శ్లో॥ ముష్ణంతీ విశ్వఖేదం కలశజలనిధిస్ఫారభంగప్రభాభిః
పుష్యంతీ సర్వథద్రిం కుటిలజనచయే దావపాతం పతంతీ
పంథాస్సాపత్కదివ్యాలయవరవివృతేస్సాధువంద్యాఽనవద్యా
లక్ష్మీదివ్యస్రవంతీ విహరణశఫరీ రక్షతాన్నస్వదీక్షా

శ్లో॥ సేవానమ్రాఖిలసురశిరస్స్ఫారమాణిక్యమాలా
రోచిర్నీరాజితపదయుగాస్తోకసౌందర్యరమ్యా
తప్తస్వాంతామలసుఖకరస్మితమాధుర్యపూర్ణా
భాయాచ్చిత్తే సతతమపి సా తావకీనాంగయష్టిః.

ఉ॥ ధారణిఁబోవు మానవుఁ డథస్థలి నేలను బూడియున్న బం
గారము నేవిధాన నెఱుఁగంగ నశక్తుఁడో తద్విధంబు, సం
సారదురీషణత్రయవిచారమలీమసమార్గగామినై
నారయనైతి, నిన్నుఁ గమలాధిపుగా నొకనాటికేనియున్.

ఉ॥ ఈ జగముల్ సృజింపఁ బరివృద్ధినొనర్ప నశింపఁజేయఁగా
రాజదఖండచిన్మయవిలాసుఁడవీవు, త్రయీమయుండ వ
వ్యాజదయాపయోనిధివి వ్యాసమునీంద్రకృతాగమాంతవా
చాజయశీలవాదిపురుషప్రథితుండవు నీవెకా ప్రభూ.

ఉ॥ ఆతఁడె నాశరణ్యము శ్రియఃపతి శంఖరథాంగపాణి ప్రా
భాతికపుండరీకదళభాగ్యకచాకచిలోచనుండు గ్రీ
వాతటలంబమాననవపుష్పస్రగుజ్వలదివ్యకౌస్తుభ
స్ఫీతమహాస్సుగంధసురభీకృతవత్సుఁడు లోలకుంతల
వ్రాతలసద్విశేషకుఁ డపారకృపారసధాముఁ డాశ్రిత
త్రాత మనోహరస్మితవిలాసకలామృదులాధరుం డసం
ఖ్యాతరవిప్రభోపమమహామణిదీప్తకిరీటశాలి శో
భాతతకుండలద్వయవిభాస్వరగండతలుండు నిత్యము
క్త్రాతినమస్క్రియాంజలిపుటార్చితుఁ డుజ్జ్వలనాసికుండు । కాం
చీతనుమధ్యముండు మృదుచేలుఁ డనేకగుణాస్పదుండు వి
ఖ్యాతయశోధనుండు, కటకాభరణాంచితతత్క్షణోన్మిష

న్నూతనపద్మముగ్ధచరణుండు మణిప్రచురాంగుళీయకో
ద్భూతరుగర్చితాంగుళిపదుండు సువర్ణమయాంగదద్వయీ
జాతపిశంగవర్ణరుచిచారుతరాంసతలుండు రత్నభూ
షాతనుకంబుకంధరుఁడు శ్యామశరీరుఁడు శ్రౌతదివ్యవా
చాతతసారకీర్తితుఁడు జన్మజరామరణాదిహీనుఁ డా
పూతతరస్వశక్తిపరిపోషితనిత్యవిభూతి హేయసం
ఘాతవిదూరవర్తి త్రిజగత్సుజనాభయదానశౌండుఁ డు
ద్యోతితసత్వవృత్తి హృదయోత్సవకారి నిసర్గసుందర
శ్రీతరుణుండు సవ్యతులసీదళకల్పితమాలికాసమా
యాతసువాసనాపులకితాంతరభావుఁ డకారవాచ్యుఁ డ
జ్ఞాతమహానుభావుఁడు సనాతనమర్త్యుఁడు బ్రహ్మనామనా
నాతనుచిత్స్వరూపగతి నారవదాయణుఁ డెల్లవేళలన్.

చ॥ అనవిని శ్రీధరారమణుఁడంత శుచిస్మితమాధురీమయా
ననుఁడగుచెల్లవారు కరుణావరుణాలయ! తే నమస్క్రియా
యని వినుతించుచుండ గగనాంగణవీధికి లేచిపోయె ఘో
రున సుమవృష్టి దైవతసరోరుహనేత్రలు గ్రుమ్మరింపఁగన్

గీ॥ ఆమహాశ్చర్యపరిణామ మరసి యల్లె
వరవశతనున్నయట్టి యవ్వానిగాంచి
నారదుఁడు దివ్యగానవిశారదుండు
వరుస జరిగిన గాథ నీసకణిఁబలికె.

ఉ॥ భాసురశీల! నీకొకభవంబున ధీమతి శిష్యుఁడౌచు క
వ్యాసము పుండరీకమను వైదికసూక్తికపార్థమీవదే
దో సవరించి చెప్ప నిది దోసముసుమ్మని వాదులాడి నీ
చేసిన గ్రంథమీకరణి స్వీకృతిఁజేసెను చిత్రమింతియై.

గీ॥ పూర్వజన్మంబునందీవు ముద్దరాల
వితఁడు నీమగఁడిక్లాట హేతువేమి
రత్నగర్భాప్రదత్తదుర్వారశాప
ఫలము దుష్పాండితికి శిష్యపదసపర్య.

ఉ॥ ఈవిషయంబులోని నిజమెల్లఁ గనుంగొనఁగోరితేని లో
భావనచేయుమల్లపుడు భర్తృవియోగభరార్తితో భవ
త్పావన సన్నిధానమునఁ దా వచియించు స్వగాథ రత్నగ
ర్భావిమలాఖ్యమీర నొకభామిని సర్వము నీకె వేద్యమౌ.

గీ॥ శారదాదేవి యిచ్చోట దా శిలాస్వ
రూపమెత్తంగవచ్చుట లోఁదలంచి
వేదమాయగ్రహారమై వెలసియుంట
సకలసురబృందమీరీతి జననమొందె.

గీ॥ స్వీయనాభిప్రదేశస్థతోయజమునఁ
గొడుకు కోడలు వాదాడుగొడవఁజూచి
ఆపరంబ్రహ్మమేనన నవతరించె
హరియె విద్యావిలాసాఖ్య నయ్యమాకు.

గీ॥ ఇందిరాదేవి ఇందుగా నిచటఁ బెరిఁగె
నీమె వృత్తాంతమంతయు నెఱుకపడెడు
గాన నొకసారి నీమనఃకమలమందుఁ
బాఱఁజూడుము విప్రసంభాషణంబు.

గీ॥ ఆతఁడే బ్రహ్మ వానివ్యాహారసరణి
ద్వ్యర్థిగానుండు మెల్లగా నరసితేని

ఇందిరాబ్రహ్మపావనవృత్తమందుఁ
బుట్టుపూర్వోత్తరంబెల్లఁ బోధపడును.

గీ॥ ఇందిరానందమయరూపవందనమున
శారదాబ్రహ్మదివ్యావతారకలన
ధన్యుఁడవు గాన నీవింక దరలుమయ్య
భార్యతోఁగూడ నాదివ్యపదముఁజేర.

ఉ॥ ఈవిధి మీరు జన్మమిటనెత్తగవత్తురటంచునెంచి వృ
ద్ధ్వలయేశుఁడైన హరివేదపురంబును సృష్టిఁజేసి భూ
దేవులుగా నొనర్చె నలదేవతలన్ బరికింపు మీ సరవం
తీవిమలప్రవాహమన దివ్యతరంగిణియే మహాశయా!

ఉ॥ నీవిఁక భార్యతోఁగలిసి నిత్యవిభూతికిఁ జేరితేని గం
గావరపూరమీపుర మెకామెకి రెండునుఁగూడ సత్యలో
కావృతినందు నిద్ది సరియయ్యెను నాభిసరోరుహుండు న
న్నీవిధిఁజెప్పుమంచు మహనీయనియోగము సేసె నెంతయున్.

క॥ అని యీవిధమునఁ బలుకుచు
ఘనమతియగు నారదుండు గానముచేతన్
మనమున శ్రీహరి నెన్నుచు
జనియెను శ్రీగాలి మహతి సన్నఁగమ్రోయన్.

ఉ॥ ఆరయ నాటిరాత్రి పరమాత్ముఁడు శ్రీహరి కోటిమన్మథా
కారముఁదాల్చి స్వప్నమునఁగన్పడి నీవిఁక భార్యతోడ నీ
పారి స్వయంప్రభోరువిరజాతట దివ్యవికుంఠలోకము
న్జేరుమటన్న నాఘనుఁడు స్వీకృతదివ్యశరీరుఁడై చనెన్.

ఉ॥ పాపము, నన్నిఁకెప్డు డెడబాయక నూతనమైన దివ్యమే
ధాపురశక్తి నిచ్చిన సుధాకరమూర్తి హయాననుండు గా
ధావరిపూర్తి సల్పెను వృథాయగు నే తనునమ్ముకొన్న నే
నా పరమాత్మ నమ్మితిని నాతఁడు నమ్మెను నన్నుఁ దానెదన్.

ఉ॥ కాని, స్వతంత్రకావ్యమును గల్పనసేయుట కష్టమంచు న
చ్చో నిటువంటి నిర్వచనసుందరగాథ మఱింత కష్టమం
చో నవనీతపేశలహృదుజ్జ్వలులార యెఱింగియుందు రెం
దైనఁ బ్రమాదమున్న యెడ నాగ్రహమొందక నన్ క్షమింపుఁడీ!

శా॥ ఆమూలాగ్రముగాఁ బ్రబంధమును మీ రాలించి తత్రత్యవా
చాముద్రాపతితప్రమాదముల సంస్కారంబుగావించి, గా
థామర్యాద నెఱింగి మత్కవనసిద్ధాంతప్రయోగాది నా
నామార్గంబులఁ జూచి మీరపుడు నన్నయ్యా! కటాక్షింపుఁడీ!

ఉ॥ భామతి గాథకే విధపు బాంధవమున్ గలిగింపఁ జేయదీ
ధీమతి పాత్రకల్పనము దీనిరహస్యము వేద్యమౌను మీ
కే మునుముందిదింకఁ బఱియింపఁ దృతీయవిలాసమందు కా
నీ మఱియొక్కమాట వచియించితిఁ గొంత "కపింజల" క్రియన్.

శా॥ ఈకావ్యంబును సావధానముగఁ దా వీక్షించి దీవించు ల
క్ష్మీకాంతాహ్వయ వేంకటేశకవులన్ శ్రీ దక్షిణామూర్తి సు
శ్లోకున్ శ్రీ వరదార్యవర్య కవిరాజున్ సత్యనారాయణా
ఖ్యాతు న్నయ్యవశాస్త్రి ధీరు నెద సౌహార్దంబుతో నెంచెదన్.

మ॥ అరయన్ నన్నొకముఖ్యమిత్రునిగఁ దామాశించి నిర్వ్యాజవై
ఖరి ముద్రాపతితప్రమాదముల సంస్కారంబుగావించి రి

ర్వారు, శ్రీ వేంకటరావుగారు మన "రావూరు" పరిధాశాలి, స
త్సరసుం డందుల కేఁ గృతజ్ఞుఁడను, కృష్ణావత్రికాశాలకున్.

మ॥ తన సంతానముకన్న నన్నధికవుత్రప్రేమతోఁ బెంచి వి
ద్యను నేర్పించిరి "అక్కబావ" లిఁక నేఁదన్మంగళాశాసనం
బున నే ధన్యుఁడనైతి వారిఋణమున్ బోకార్పు టెట్లో గదా
యని, యీరీతి గృతజ్ఞతన్ దెలిపితిన్ హర్షంబు రెట్టింపగన్.

క॥ నాతలిదండ్రులనెంతున్ బ్రీతిన్ గుదిమెళ్ళవంశవిశ్రుతసీతా
సీతారామాచార్యుల సీతారాములవిధాన చేతస్సీమన్.

గీ॥ వారిసుతులందు రెండవవాఁడ నేను
బేరు రామానుజుండని పిలుచుచుండ్రు
ప్రాయ మిరువదియేడు సంవత్సరములు
రచనఁజేసితి విద్యావిలాస కృతిని.

కం॥ ఏతన్నూతనకావ్యము ప్రీతిన్ బఠియించెనేని వినినన్ గానీ
స్ఫీతానేకశుభంబులు చేతోమోదంబు జన్మసిద్ధియుఁ గలుగున్.

శా॥ ఆచంద్రార్కము నీయశస్సు కృతినాథా! గాంగ ఫేనప్రభా
ప్రాచుర్యంబును ధిఃకరించి కలశీవారాశివీచీవమో
రోచీరాశినధఃకరించి కమలాప్రోన్ముగ్ధమందస్మిత
శ్రీచాతుర్యము నెంచి కార్తికకచాంద్రిన్ మించి రాజిల్లుతన్.

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్య ప్రణీత
విద్యావిలాస ప్రబంధ
పంచమోల్లాసము

# మురళీధరవిలాసము

కవి:- శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు,

ముక్తిపల్లి అగ్రహారము, రేపల్లెతాలూకా. వెల 0-12-0.

ఇది కేవల కల్పిత నిర్వచన కథాప్రబంధము. కవిత్వమా-అస్ఖలితధారా ప్రవాహము. శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిచ్చిన అభిప్రాయములో దీని ధారాశుద్ధి సర్వథా ప్రాచీనమహాకవులు నన్నయాదుల ధారతోఁ దులదూఁగఁగలదనియు, ఈ కాలమునందే కాదు, పూర్వకాలమునఁగూడ యిట్టి ధారాశుద్ధిగల కవులు కడుంగడు మృగ్యంబని యున్నది. శ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిట్లు ఆశీర్వదించిరి. ఆచార్యులుగారు సంస్కృతాంధ్రములయందు నిరుపమానపాండిత్యముకలిగి యీ గ్రంథమును రచించిరి. ఇది శయ్యాపాకవృత్త్యాద్యుత్తమగుణములు గలిగియున్నది. శ్రీ అవధాని శిరోమణి కాశీ కృష్ణాచార్యులగారిట్లు కటాక్షించిరి. జాజిపూల మాలికలఁబోలినవి యగుటఁజేసి యీ పద్యములు భక్తిశృంగారరసములతోనిండి శ్రీ జయదేవుని పద్యముల ననుకరించుచున్నవి. ఇట్టికల్పిత ప్రబంధములు మాత్రమే కవులయొక్క సహజప్రతిభను చాటును. ఇంకను తదితరవిద్వదాశీస్సులుకలవు — కవితాప్రియులు చదువదగినది.